

శ్రీమతే రామానుజాయ నమః

## అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్
## అనుగ్రహించిన

# ప్రమేయసారం

( శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన ద్రావిడ వ్యాఖ్యానము,
దాని ఆంధ్రానువాదము, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ వైభవములతో )


అనువక్త

**డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు**


శ్రీయతీశ్వరసిద్ధాంత రక్షణవ్యాపనోద్యతా ।
శ్రీరామానుజసిద్ధాంతసభా జేజీయతాం సదా ॥





ప్రకాశకులు

శ్రీరామానుజ సిద్ధాంతసభ, సికింద్రాబాద్

**2015**

# ప్రమేయసారం – అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్

**( శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన ద్రావిడ వ్యాఖ్యానము,**
**దాని ఆంధ్రానువాదము, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ వైభవములతో )**

**అనువక్త - డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు**

ప్రథమముద్రణము : జనవరి, 2015

సందర్భము : గోదా కల్యాణము

వేదిక : శ్రీలక్ష్మీనారాయణస్వామి దేవాలయము, సికింద్రాబాద్

ప్రతులు : 500

అన్ని హక్కులు : అనువాదకునివి

ముఖచిత్రం : శ్రీరంగనాథుడు, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్
శ్రీరంగం.

ప్రతులకు :**1. శ్రీమాన్ స్వామిదాసు గారు**
3-3-713, రంగరేజ్ బజార్
సికింద్రాబాదు-500 003
ఫోన్ : 040-23004433, 94400 90324

**2. శ్రీకదారిలక్ష్మణ రావు**
H/o శ్రీమతి కదారి జయప్రద
నెం.1-8-72/2, టెంపుల్ ఆల్వాల్
బోలారమ్ (పోస్ట్), సికింద్రాబాద్-500 010
ఫోన్ : 7207846848, 9676675155

డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.

# ముందుమాట

సర్వజ్ఞులైన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడి అనే రహస్యగ్రంథం ఆరంభంలో **"ముముక్షువుక్కు అఱియవేణ్డియ రహస్యమ్ మూన్ఱు. అదిల్, ప్రథమ రహస్యమ్ తిరుమంత్రమ్"** అని సూత్రీకరించడం ద్వారా ముముక్షువుకు ప్రథమ జ్ఞాతవ్యం అష్టాక్షరి అనే విషయాన్ని తెలిపారు. ఈ అష్టాక్షరీ మంత్రంయొక్క వైభవాన్ని నారాయణోపనిషత్, సుబాలోపనిషత్ మొదలైన శ్రుతులు స్పష్టం చేశాయి. నారాయణోపనిషత్ **"ఓమిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణా యేత్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి"** అని అంటూ మంత్రంయొక్క శాబ్దికస్వరూపాన్ని తెలుపగా, సుబాలోపనిషత్ **"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతిః నారాయణః"** అని నారాయణ నామాన్ని అర్థానుసంధానపూర్వకంగా అనుసంధించింది. నారాయణశబ్దార్థాన్ని నమ్మాళ్వార్లు **"తన్నుళ్ళే అనైత్తులకమ్ నిఱ్క నెఱిమైయాల్ తానుమ్ అవఱ్ఱుళ్ నిఱ్కుమ్ పిరాన్"** అని అనుసంధించగా, తిరుమంగైయాళ్వార్లు **"ఎమ్బిరానెన్దై ఎన్నుడై చ్చుఱ్ఱమ్ ఎనక్కరశు ఎన్నుడై వాణాల్... నారాయణా ఎన్నుమ్ నామమ్"** అని అంటూ అర్థానుసంధానపూర్వకంగా నారాయణనామానుసంధానాన్ని చేశారు. అష్టాక్షరి మంత్రంయొక్క శబ్దార్థ వైభవాన్ని తెలిపే ఇటువంటి సూక్తులు ఉభయవేదాంతాలలో అనేకం గోచరిస్తాయి. అష్టాక్షరీ మంత్రార్థసారం భాగవత శేషత్వ పారతంత్ర్యాలనే విషయాన్ని తిరుమంగై ఆళ్వార్లు **"నిన్‌తిరువెట్టెళుత్తుమ్ కఱ్ఱు నాన్ ఉఱ్ఱదు ఉన్ అడియార్కు అడిమై"** అని అంటూ తెలిపారు.

ఈవిధంగా ముముక్షువుకు అవశ్యం జ్ఞాతవ్యమైన అష్టాక్షరి మంత్రార్థ స్వరూపాన్ని సమగ్రంగా మధురమైన పాశురాల రూపంలో అందించే అపూర్వ ప్రబంధం ప్రమేయసారం. ఈ నామంలోని ప్రమేయశబ్దానికి అష్టాక్షరీ మహామంత్ర ప్రమేయమని అర్థం. పూర్వాచార్యులు రచించిన రహస్యగ్రంథాలలో ఈ కృతి మొట్టమొదటిది అని చ్ప్పవచ్చు ఇది తరువాత కాలంలో ఆవిర్భవించిన శ్రీపరాశరభట్టర్ ప్రణీతమైన అష్టశ్లోకి, పెరియవాచ్చాన్‌పిళ్ళై పరందరహస్యమ్, పిళ్ళైలోకాచార్యుల వారి ముముక్షుప్పడి ఇత్యాది రహస్య గ్రంథాలకు, దేశికుల **"తిరుమంత్రచ్చురుక్కు"** ఇత్యాదులకు దోహదం చేసింది. ఈ ప్రమేయసారాన్ని అనుగ్రహించిన ఆచార్యులు

అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ (దయాపాల ముని). ముందుగా, వీరి వైభవం సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

## అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ వైభవం

**కార్తికే భరణీజాతం యతీంద్రాశ్రిత మాశ్రయే ।**
**జ్ఞానప్రమేయసారాభివక్తారం వరదం మునిమ్ ॥**

(కార్తికమాసంలోని భరణీనక్షత్రంలో అవతరించినవారు, యతిరాజులైన శ్రీరామానుజులను ఆశ్రయించినవారు, జ్ఞానసారం, ప్రమేయసారమనే గ్రంథాలను రచించినవారైన అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌ను ఆశ్రయిస్తున్నాను.)

**జ్ఞానభక్త్యుత్థ వైరాగ్యం రామానుజపదాశ్రితమ్ ।**
**పంచమోపాయసంపన్నం సంయమీంద్రం నమామ్యహమ్ ॥**

(జ్ఞానభక్తులవల్ల ఏర్పడిన వైరాగ్యాన్ని కలవారు, శ్రీరామానుజుల పాదాలను ఆశ్రయించినవారు, వారిపట్ల పంచమోపాయాన్ని– ఆచార్యులైన శ్రీరామానుజులే ఉపాయమనే నిశ్చయాన్ని –కలవారైన అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌ను నమస్కరిస్తున్నాను.)

**రామానుజార్యసచ్ఛిష్యం వేదశాస్త్రార్థసంపదమ్ ।**
**చతుర్థాశ్రమసంపన్నం దేవరాజమునిం భజే ॥**

(శ్రీరామానుజుల గొప్ప శిష్యులు, వేదశాస్త్రాల అర్థాలను సంపదగా కలవారు (వేదశాస్త్రాలను చక్కగా గ్రహించినవారు) సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించినవారైన దేవరాజముని అనే అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌ను ఆశ్రయిస్తున్నాను.

యజ్ఞమూర్తి అనే మహావిద్వాంసులైన బ్రాహ్మణుడొకడు గంగాస్నానంకోసం వెళ్ళి, ఆ నదిలో స్నానం చేసి, అక్కడ ఆ ప్రాంతంలో ఉండే విద్వాంసులను అందరినీ జయించాడు. అక్కడ అతడు అద్వైతసన్న్యాసాశ్రమాన్ని పరిగ్రహించి, విద్యతో, శిష్యసంపదతో వెలుగుతూ ఉండగా, శ్రీరామానుజుల వైభవాన్ని గూర్చి విన్నాడు. "నేను శ్రీరంగానికి పోయి, శ్రీరామానుజులతో వాదించాలి" అని భావించి, తాను రచించిన పలు గ్రంథాలను కట్టలుగా కట్టి, వాటిని మోయించుకొంటూ, తన విద్యామదం స్ఫురించేటట్లుగా వేగంగా శ్రీరంగానికి వచ్చి చేరాడు. శ్రీరామానుజులను

కలిసి, "నాతో మీరు వాదించాలి" అని అన్నాడు. శ్రీరామానుజులు అందుకు అంగీకరిస్తూ, అతనితో "నీవు ఓడిపోతే ఏమి చేస్తావు ?" అని అడిగారు. యజ్ఞమూర్తి "నేను ఓడిపోతే మీ పాదరక్షలను మోస్తూ, మీ పేరును పెట్టుకొని, మీ సిద్ధాంతంలో ప్రవేశిస్తాను" అని అన్నాడు. శ్రీరామానుజులపుడు దానికి బదులుగా "నేను ఓడిపోతే గ్రంథసన్న్యాసాన్ని చేస్తాను" అని అన్నారు. అతడు అందుకు ఒప్పుకొన్నాడు.

ఈ రీతిలో పరస్పరం ఒప్పందం చేసికొన్న శ్రీరామానుజులు, యజ్ఞమూర్తి ఇద్దఱు పద్దెనిమిది రోజుల పాటు వాదించాలనే కాలనియతిని ఏర్పాటు చేసికొని వాదించడం ఆరంభించారు. మదగజాలు పోటీ పడినట్లుగా సాగిన వారి వాదం పదహేఱు దినాలపాటు ఏకధాటిగా జరిగింది. ఈ వాదం శ్రీరంగాలయంలోని మేట్టళకియశింగర్ స్వామి (నరసింహస్వామి) సన్నిధికి ఎదురుగా జరిగినదని దివ్యసూరి చరితంలో తెలుపబడింది. యజ్ఞమూర్తిని వాదంలో జయించడం శ్రీరామానుజులకు సాధ్యం కాలేదు. పదిహేడవనాటి వాదంలో యజ్ఞమూర్తివాదం మఱింత బలపడింది. అతడు అడిగిన ప్రశ్నకు తగిన బదులు శ్రీరామానుజులకు వెంటనే స్ఫురించలేదు. అప్పటికి సాయంకాలమైనది. యజ్ఞమూర్తి తన విజయసూచకంగా వాదాన్ని నిలిపి ఇంటికి వెళ్ళిపోయాడు.

శ్రీరామానుజులకు మనస్సులో చాలా వ్యాకులం కల్గింది. తమ మఠాన్ని చేరి, తమ తిరువారాధనలోని అర్చామూర్తి అయిన వరదరాజస్వామికి ఆరాధించి నివేదనను అర్పించి, "వరదరాజస్వామీ! ఆళ్వార్లనుండి ఆళవందార్‌వరకు ఇంతకాలంగా గొప్ప సంప్రదాయంగా సుప్రతిష్ఠితమై సాగే ఈ దర్శనం నావల్ల అపజయం పాలు కాబోతున్నదే! ఈనాటివరకు దేవరవారి స్వరూపరూపగుణ విభూతులు సత్యమని ప్రమాణనిర్వాహం చేస్తూ వచ్చావు. ఇపుడొక మాయావాదిని తీసుకొని వచ్చి, నా కాలంలో అన్ని ప్రమాణాలను నిర్వీర్యం చేసి, వినోదించాలని నీవు అనుకొంటే, ఆ రీతిలోనే కానీ ! నేనేమి చేయగలను ?" అని విన్నపించి తాము భుజించకుండానే వ్యాకులంతో నిద్రపోయారు.

ఆనాటి రాత్రి వరదరాజస్వామి శ్రీరామానుజులకు స్వప్నంలో సాక్షాత్కరించి, "రామానుజా ! మీరెందుకు వ్యాకులపడుతున్నారు ? మీకు సమర్థుడైన ఒక శిష్యుని ఇవ్వబోతున్నాను; గమనించండి. మీ పరమాచార్యులైన ఆళవందార్ చేసిన మాయావాదఖండనాన్ని పురస్కరించుకొని పల్కి, అతనిని జయించండి" అని అన్నాడు.

శ్రీరామానుజులు ఉదయమే భగవన్నామోచ్చారణాన్ని చేస్తూ లేచి, కన్నులను తెరచి, "ఇదేమి స్వప్నం! ఆశ్చర్యం!" అని చాలా ఆనందపడి, కలలో వరదరాజస్వామి పల్కిన మాటను తమ మనస్సులో భావించారు. సంతోషంతో నిత్యకర్మానుష్ఠానాలను ముగించుకొన్నారు. తమ అర్చామూర్తి వరదరాజస్వామిని సేవించి, వాదానికి స్మితవదనంతో, ప్రసన్నచిత్తంతో బయలుదేరారు. అపుడు యజ్ఞమూర్తికూడా భావజ్ఞుడైనందున, శ్రీరామానుజులలో కానవచ్చే గాంభీర్యాన్ని, సంతోషాన్ని గమనించి, "వీరు నిన్న ఇక్కడనుండి వెళ్ళినపుడు వ్యాకులంతో వెళ్ళారు. ఇపుడు మదగజంవలె వస్తున్నారు. అందువల్ల దీనికి కారణం మానుషం కాదు. అతిమానుషమై ఉండాలి" అని నిశ్చయించుకొన్నాడు. తటాలున లేచి, శ్రీరామానుజులకు ఎదురేగి సేవించి, వారి శ్రీచరణాలలో పడి నమస్కరించి, "మీకు ఓడిపోయాను" అని అంటూ వారి పాదరక్షలను శిరసా వహిస్తూ, "నన్ను మీరు దయచూడాలి" అని అన్నాడు. శ్రీరామానుజులు "ఇదేమి !" అని ఆశ్చర్యపడి "వాదించవచ్చుకదా!" అని అతనితో అన్నారు. అపుడతడు "దేవరవారికి శ్రీరంగనాథుడు ప్రత్యక్షమైన తరువాత, మీకు ఆ శ్రీరంగనాథునకు మధ్య భేదం లేదు– అని తెలిసికొన్నాను. ఇకపై మీ సన్నిధిలో నేను నోరు తెఱచి ఒక్కమాటకూడా పలికే అవకాశం, ప్రసక్తి లేదు" అని అన్నాడు.

శ్రీరామానుజులు చాలా సంతోషించి "అయినా, మీరు వాదించిన అద్వైత సిద్ధాంతంలో– "గుణయోగాలు ఉన్నాయని పలికే వేదవాక్యాలు అప్రమాణాలు కాగలవు; అవిద్యాతిరోహితమైన బ్రహ్మకు గుణయోగమున్నది కనుక, సగుణశ్రుతిలో విరోధం లేదు"– అని అంటే, అది పొసగదు. ఏ విధంగా? అంటే, **"జ్ఞానరూపం పరం బ్రహ్మ తన్నివర్త్యం మృషాత్మకమ్, అజ్ఞానం చేత్ తిరస్కుర్యాత్ కః ప్రభు స్తన్నివర్తనే"** (నాథమునుల శ్లోకం– శ్రీభాష్యం– జిజ్ఞాసాధికరణమ్) (జ్ఞానస్వరూపుడైన పరబ్రహ్మను, ఆ పరబ్రహ్మచే నివర్తింపజేయదగినది, అసత్యమైనది అయిన అజ్ఞానం అనే అవిద్య– ఆవరించినట్లయితే, ఆ అజ్ఞానాన్ని ఎవరు తొలగించడంలో సమర్థులు) అనే రీతిలో జ్ఞానరూపుడైన పరబ్రహ్మను అజ్ఞానరూపమైన అవిద్య ఆవరిస్తే, ఆ అవిద్యకు నాశం లేదు కనుక, ఆ అవిద్య నిత్యమైపోతుంది. అయితే ఏమి? అని అంటే, అవిద్య– అని, బ్రహ్మ – అని రెండు వస్తువులు ఉన్నవి కనుక, అద్వైతమనే మహాగజం ద్వైతమనే లోతైన బురద నిండిన గోతిలో మునిగిపోతుంది"– అని అంటూ పలు యుక్తులను పలికారు. (సాయపనేని వేంకటాద్రి నాయక ప్రణీతమైన, శ్రీరామానుజ

చరిత్రను మధురంగా తెలిపే సకలజనసంజీవనమనే కావ్యంలో చతుర్థాశ్వాసంలో 117వ పద్యం నుండి పంచమాశ్వాసంలోని 16వ పద్యం వరకు యజ్ఞమూర్తి రామానుజుల మధ్య జరిగిన వాదం వర్ణింపబడినది. ఈ భాగాన్ని మహా మహోపాధ్యాయ శ్రీమాన్ శ్రీ.న.చ. రఘునాథాచార్య స్వామివారు చాలా ప్రామాణికమైన, విశదమైనా వ్యాఖ్యను వెలయించారు.) యజ్ఞమూర్తి శ్రీరామానుజుల మాటలను అంగీకరించి, ఓటమిని ఒప్పుకొని, తాను అంతవరకు ధరించిన ఏకదండాన్ని విడచిపెట్టి, శ్రీరామానుజుల పాదాలపై సాష్టాంగదండప్రణామాలను చేసి నిలచాడు. శ్రీరామానుజులు యజ్ఞమూర్తిని సాదరంగా లేవనెత్తారు. అపుడు యజ్ఞమూర్తి "దాసునకు త్రిదండకాషాయాదులను ప్రసాదించాలి" అని విన్నపించగా, శ్రీరామానుజులు "ఆవిధంగానే ఇస్తాను" అని పల్కి, "పూర్వం నీవు శిఖాయజ్ఞోప వీతాలను వీడినందున దానికి ప్రాయశ్చిత్తం చేయాలి" అని అంటూ, **"హీనో యజ్ఞోపవీతేన యది స్యాత్ జ్ఞానభిక్షుకః, తస్య క్రియా నిష్ఫలాః స్యుః ప్రాయశ్చిత్తం విధీయతే, గాయత్రీసహితాయైవ ప్రాజాపత్యాన్ షడాచరేత్, పునః సంస్కార మాహృత్య ధార్యం యజ్ఞోపవీతకమ్"** (ప్రపన్నామృతమ్ - 25-46, 47 శ్లోకాలు) (పరబ్రహ్మ ధ్యానాన్ని చేసే సన్యాసి యజ్ఞోపవీతాన్ని లేనివాడైతే, అతని క్రియలన్నీ నిష్ఫలాలు అవుతాయి. అతనికి శాస్త్రాలలో ప్రాయశ్చిత్తం విధింపబడింది. అతడు గాయత్రీమంత్రజపాన్ని చేసినా, ఆఱు ప్రాజాపత్యకృచ్ఛ్రాలను ఆచరించాలి. అతనికి తిరిగి ఉపనయనం మొదలైన సంస్కారాలను చేయించి, యజ్ఞోపవీతాన్ని ధరింపజేయాలి) అనే రీతిలో అతనిచే శాస్త్రోక్తరీతిలో ప్రాయశ్చిత్తం చేయించి శిఖాయజ్ఞోపవీతాలను ధరింపజేశారు. **"ప్రధార్య స్తాపసంస్కారో వైష్ణవో మునిభిః స్మృతః, సర్వాశ్రమేషు వసతాం స్త్రీశూద్రాణాం ద్విజోత్తమ!"** (బ్రాహ్మణోత్తమా! బ్రహ్మచర్య- గార్హస్థ్య- వానప్రస్థ-సన్న్యాసాలనే నాల్గు ఆశ్రమాలలో ఉండే ద్విజులకు, స్త్రీలకు, శూద్రులకు విష్ణుసంబంధి అయిన తాపసంస్కారం తప్పక ధరించదగినదని మునులచే చెప్పబడింది) అనే రీతిలో చక్రాదిలాంఛనాది రూపమైన పంచసంస్కారాలను ప్రసాదించారు. **"ఉపవీతం త్రిపుండ్రం చ పాత్రం జలపవిత్రకమ్, కౌపీనం కటిసూత్రం చ న త్యాజ్యం యావదాయుషమ్"** (యజ్ఞోపవీతం, త్రిపుండ్రం, కరకమనబడే పాత్రం, జలపవిత్రం, కౌపీనం, మొలనూలు మొదలైనవానిని యావదాయుషం సన్న్యాసులు ధరించాలి) అనే రీతిలో "త్రిపుండ్రకాషాయాదులను జీవించినంతకాలం ధరించండి" అని పల్కి ఇచ్చారు. యజ్ఞమూర్తిపట్ల తమకు గల ఆదరాతిశయం చేత, వరదరాజ

స్వామి తమకు స్వప్నంలో చేసిన ఉపకారానికి గుర్తుగా యజ్ఞమూర్తికి **"అరుళాళ పెరుమాళ్ ఎమ్బెరుమానార్"** అనే పేరును పెట్టారు.

తరువాత, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌లను శ్రీరామానుజులు తీసికొనిపోయి శ్రీరంగనాథుని సేవింపజేసి, తీర్థప్రసాదాలను, శఠారిని ఇప్పించి, తమ మఠానికి తీసికొనిపోయారు. తమ ఆరాధనలోని అర్చామూర్తి, వరదరాజ స్వామిని దర్శింపజేసి, "వీరేసుమా, మిమ్ములను మా వద్దకు చేర్చినది'" అని పల్కి, వరదరాజస్వామికి తిరువారాధనను, ప్రసాదనివేదనను చేసి, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌కు నివేదిత ప్రసాదాన్ని అనుగ్రహించారు. వారు కూడా ప్రసాదాన్ని స్వీకరించి సంతుష్టులయ్యారు. ఉడైయవర్ అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌కు ప్రత్యేకమైన మఠాన్ని ఏర్పాటు చేశారు. తరువాత అరుళాళ పెరుమాళ్ శ్రీరామానుజుల సన్నిధిలో దివ్యప్రబంధాలను వాటిలోని అర్థవిశేషాలను గ్రహించారు. ఆ పిమ్మట కూరేశులు ముదలియాణ్డాన్ అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌ల సహాయంతో సిద్ధాంత నిర్వాహాన్ని చేశారు.

**అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ ఆచార్యభక్తి :**

ఒకనాడు, దేశాంతరులైన ఇద్దఱు శ్రీవైష్ణవులు శ్రీరంగానికి వచ్చి ఒక వీథిలో ఉండే కొందఱిని చూచి, "ఎమ్బెరుమానార్ ఉండే మఠం ఏది?" అని అడిగారు. వారపుడు "ఏ ఎమ్బెరుమానార్ మఠం?" అని ఎదురు ప్రశ్న వేశారు. అపుడు దేశాంతర వైష్ణవులు "ఈవిధంగా అడుగుతున్నారేమి? మన సంప్రదాయంలో ఇద్దఱు ఎమ్బెరుమానార్‌లు ఉన్నారా! ఏమి ?" అని అన్నారు. అపుడు వీథిలోని వ్యక్తులు "అవును; ఉన్నారు. అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనే వారు ఇంకొకరున్నారు. కనుక ఈ విధంగా అన్నాము" అని బదులిచ్చారు. "వారెవరో మాకు తెలియదు. మేము ఉడైయవర్ మఠాన్ని గూర్చి అడిగాము" అని ఆగంతకులనగా, వారికి వీథిలోని వ్యక్తులు శ్రీరామానుజుల మఠాన్ని చూపించారు.

ఈ వృత్తాంతాన్ని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ విని, "అయ్యో! ఎంతపని జరిగింది. నేను ఆచార్యులైన ఉడైయవర్‌ను విడచి, వేఱొక చోట ఉన్నందువల్ల కదా లోకంలోని వారు నన్ను ఎమ్బెరుమానార్‌కు సాటిగా నన్ను పలికారు. అందుచేత నేను చాలా అనర్థాన్ని పొందానే !" అని చాలా వ్యాకులాన్ని పొంది, అప్పటికపుడే తమ మఠాన్ని కూలగొట్టించి, శ్రీరామానుజుల పాదాలను

పట్టుకొని, “అనాదికాలంగా ఈ ఆత్మ దేవరవారి శ్రీచరణాలకు దూరమై పొందిన అనర్థం చాలు. ఇపుడు కూడా దేవరవారికి దాసుడు దూరం కావాలని అనుకుంటున్నారా?” అని చాలా శోకించారు. అపుడు ఉడైయవర్ “మీరెందువల్ల ఈ విధంగా పల్కుతున్నారు'' అని ప్రశ్నించగా, జరిగిన వృత్తాంతాన్ని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ ఉడైయవర్‌కు తెలిపారు. ఉడైయవర్ అంతా విని “అయితే మీకిపుడు నేను ఏమి చేయాలి?” అని అనగా, “దాసుడు ఈనాటి నుండి దేవరవారికి ఛాయ, పాదరేఖవంటివాడను కనుక, **“నిన్ తాళిణై క్కీ*ழ்* వా*ழ்*చ్చి యాన్ శేరుమ్ వకై అరుళాయ్”** (నీ చరణద్వయ సమీపంలోని ఉ జ్జీవనాన్ని దాసుడు పొందేటట్లు అనుగ్రహించాలి) అనే విధంగా దేవరవారి శ్రీచరణాల మోల నన్ను నిలిపి, నిత్యకైంకర్యాన్ని అనుగ్రహించాలి” అని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ విన్నపించారు. అపుడు శ్రీరామానుజులు వారిని తమ మఠానికి తీసికొనిపోయి, వారిని ఒక్కక్షణం కూడా విడువకుండా తమ వెంటనే ఉండేటట్లుచేసి, వారికి జ్ఞాతవ్యార్థాలను అన్నిటిని విపులంగా అనుగ్రహించారు. (ఈ వివరాలను అన్నిటిని ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావమనే గ్రంథంలో గమనించవచ్చు.)

**అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ వైదుష్యం :**

శ్రీరామానుజుల సన్నిధిలో సకలవేదాంతసారార్థాలను సువ్యక్తంగా అధికరించిన అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ సామాన్యులు సైతం జ్ఞాతవ్యార్థాలను తెలిసికొని ఉజ్జీవించాలనే తమ ఉదారభావంతో జ్ఞానసారం, ప్రమేయసారమనే రెండు దివ్యగ్రంథాలను అనుగ్రహించారు. వాటిలో తాము నమ్మి ఆచరించిన పంచమోపాయాన్ని గూర్చి నొక్కి వక్కాణించారు. సచ్ఛిష్యునకు సదాచార్యుడే పరదేవత, ఆ ఆచార్యుని శ్రీచరణకైంకర్యమే పరమప్రాప్యం; ఆచార్యుడు భగవదవతార విశేషమని పలికారు. యతివరపునరవతార భూతులైన **“పొయ్యిలాద మణవాళమహామునులు”** ఈ కృతులను రెండిటిని వ్యాఖ్యానించినందువల్ల వీటిలోని ప్రామాణికత, అర్థపూర్తి, ఎంత గొప్పదో తెలుస్తున్నది. వీరు ద్వయవివరణరూపమైన, సంస్కృతశ్లోకరూపంలోని ఒక గ్రంథాన్ని రచించినట్లు శ్రీవేదాంతదేశికులు తమ రహస్యత్రయసారమనే గ్రంథంలోని ద్వయాధికారంలో ప్రస్తావించారు. **“చాతకమ్ పోల్ నాదన్ తన్ అరుళే పార్త్తిరుత్తల్ కోదిలడియార్ గుణమ్”** (జ్ఞానసారం-2) (చాతకపక్షి వర్షజలంకోసం ఎదురుచూచినట్లు, నాథుడైన భగవానుని కరుణకోసం

ప్రపన్నుడు ప్రతీక్షించాలి) ఇత్యాదిగా భగవన్నిర్హేతుకకృపావైభవాన్ని, **“అఱ్ఱముఱైక్కిల్ అడైన్దవర్పాల్ అమ్బుయకోన్ కుఱ్ఱముణర్న్దు ఇకళ్ళుమ్ కొళ్కైయనో? ఎఱ్ఱే, తన్ కన్టిన్ ఉడమ్బిన్ వళ్ళువన్నో కాదలిప్పదు అన్దదనై ఈన్దుకన్ద వా”** (జ్ఞానసారం–25) అని వాత్సల్యలక్షణాన్ని గూర్చి వీరు పల్కిన సూక్తిని భట్టర్, పెరియవాచ్చాన్పిళ్ళై మొదలైన పూర్వాచార్యులు అనుసరించారు. ఈ అంశాలన్నీ వీరి పాండిత్యవైభవ చిహ్నాలు.

**ఆచార్యభక్తి :**

ఒకనాడు, అనన్దాళ్వాన్, ఎచ్చాన్, తొణ్డనూర్‌నంబి, మరుదూర్ నంబి – అనే ఆచార్యులు శ్రీరామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించాలని తలచి వారి వద్దకు వచ్చారు శ్రీరామానుజులు. వారిని, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌ను ఆశ్రయింపజేశారు, అపుడు అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ చాలా భయపడి, వారితో, “పిచ్చుక గొంతుకు పనసకాయను కట్టినట్లుగా శ్రీరామానుజులు ఈ పని చేశారు. మీకు నేను పంచసంస్కారాలను చేసినా, శ్రీరామానుజుల శ్రీచరణాలే శరణమని నమ్మండి” అని అన్నారు. ఈ సందర్భం వీరి ఆచార్యభక్తిని, విధేయతను తెల్పుతున్నది. ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావం, చరమోపాయనిర్ణయం మొదలైనగ్రంథాలలో ఈ వృత్తాంతం ప్రస్తావింపబడింది.

**శ్రీవైష్ణవభక్తి :**

**“వడుగనంబి తిరునాట్టుక్కు ప్పోనార్”** (వడుగనంబి– అనే ఆచార్యులు పరమపదానికి పోయారు) అని ఒక శ్రీవైష్ణవులు అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌తో అన్నారట. అపుడు ఎమ్బెరుమానార్ మూర్ఛిల్లి, కొంతసేపటికి తెప్పరిల్లి, ఆ శ్రీవైష్ణవుని చూచి **“తిరునాట్టుక్కు ప్పోనార్”** – అని అనకూడదు సుమా! ఉడైయవర్ శ్రీచరణాలను చేరారు– అని అనాలి సుమా!” అని అన్నారట. ఈ విషయం పెరియాళ్వార్ తిరుమొళి (4–4–7)వ పాశురవ్యాఖ్యలో ప్రస్తావింపబడింది. దీనివల్ల అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌కు గల శ్రీవైష్ణవభక్తి తెలుస్తున్నది.

**భగవద్విషయంలోని వీరి అవగాహన వైలక్షణ్యం:**

**“శిఱు మామనిశర్”** (8–10–3) అనే ప్రయోగాన్ని గూర్చి పరాశరభట్టర్ చిన్నతనంలో తమ తండ్రి అయిన కూరేశులను **“శిఱు, మా”** అనే రెండు పరస్పర విరుద్ధవిశేషణాలు ఒకే ధర్మిలో ఏవిధంగా పొసగుతాయి? అని ప్రశ్నించారు.

అపుడు కూరేశులు "మన వలె అన్నపానాదులు ధారకమనేటట్లుగా ఉండేవారై, భగవద్విషయావగాహనాన్ని చూస్తే నిత్యసూరులు అనదగినట్లున్నవారైన ఆణ్డాన్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్, గోవింద ప్పెరుమాళ్ (ఎమ్బార్) వంటి వారుసుమా! **"శిఋమామనిశర్"** అని బదులిచ్చారు. ఈ సందర్భం వీరి విలక్షణ భగవదనుభవాన్ని తెల్పుతున్నది.

**కూరేశుల విషయంలోని ప్రతిపత్తి విశేషం :**

అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అస్వస్థులై ఉండగా, వారిని పరామర్శించడం కోసం కూరేశులు, పిళ్ళై ఉఱఙ్గావిల్లి దాసర్ (ధనుర్దాసు)తో పాటు కలిసి వెళ్ళారు. అపుడు అరుళాళప్పెరుమాళ్ ధనుర్దాసును చూచి "కూరేశులు నాకు కల్గించిన మనస్తాపం, నేను శ్రీయామునుల శ్రీచరణ సన్నిధికి పోయినపుడే కదా ! తీరుతుంది"అని అన్నారు. (కూరేశులు కల్గించిన మనస్తాపం ఏమంటే- కూరేశులు తమకు పరమపదాన్ని ఇప్పించగల్గిన శక్తిని కలవారైనా, వారు ఆ విధంగా చేయకుండా, మరణావస్థలో ఉండే తమను చూస్తూ ఉండడమే.) ఈ ఐతిహ్యం తిరువాయ్మొழிలోని **"పొన్నులకాళీరో"** (6-8-1) అనే పాశురం ఈడువ్యాఖ్యలో ప్రస్తావింపబడింది. దీనివల్ల కూరేశులకంటే ముందుగానే అరుళాళప్పెరుమాళ్ పరమపదించినట్లు తెలుస్తున్నది.

**శరణాగతి వైభవాన్నిగూర్చి అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ :**

అంతిమదశలో వీరు పల్కిన ఇంకొక సూక్తి శరణాగతివిషయంలో వీరికి గల అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నది. తిరువాయ్మొழிప్రబంధంలోని (6-8-6)వ పాశురం ఈడువ్యాఖ్యలో ఈసూక్తి ప్రస్తావింపబడింది.

అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ చివరిదశలో ఒకరు "మీ మనస్సులో ఇపుడు స్ఫురించే భావం ఏమి?" అని అడిగారు. అపుడు **"ఒరు పక్షి ఎమ్బెరుమానుడైయ తిరువుళ్ళత్తై పుణ్ పడుత్తిన పడి ఎన్ !- ఎన్ఱు కిడన్దేన్"** అని అన్నారట. ఈ సూక్తి శ్రీరామాయణం యుద్ధకాండలోని విభీషణశరణాగతి సందర్భంలో శ్రీరాముడు ప్రస్తావించిన కపోతోపాఖ్యానికి చెందినది.

విభీషణుడు, శ్రీరాముని శరణుపొందినపుడు అతనిని పరిగ్రహించకూడదని సుగ్రీవుడు మొదలైనవారన్నారు. శ్రీరాముడు తన స్వాతంత్ర్యంతో సుగ్రీవాదుల వాదాన్ని కాదని విభీషణుని స్వీకరించి ఉండవచ్చు. కాని, ఆ రీతిలో చేయకుండా, భక్తులకు

వశమై ఉండే తన స్వభావాన్ని వ్యక్తం చేయడంకోసం సుగ్రీవాదులను అంగీకరింపజేసి, విభీషణుని స్వీకరించాలని తలచి, కపోతోపాఖ్యానాన్ని తెలిపాడు. ఒక మగపావురం తన భార్య అయిన ఆడపావురాన్ని అపహరించిన వేటగానికోసం తన ప్రాణాన్ని త్యజించి, అతని ఆకలిని తీర్చింది. ఒక పక్షి ఈవిధంగా వర్తిస్తే, రఘుకులంలో పుట్టిన నేను ఏవిధంగా వర్తించాలి ? **"దోషో యద్యపి తస్య స్యాత్"** అని నేను పల్కిన మాటను ఈ పావురం ఆచరించి చూపించిందికదా ! నేనిపుడు ఆ విధంగా వర్తించినా, అది పావురం చేసిన దానిని అనుసరించినట్లుగా అవుతుంది. ఒక పక్షితన ప్రానాలను సైతం త్యజించి వేటగానిని రక్షించింది. అయితే, నేనా రీతిలో చేయలేదే !" అని శ్రీరాముడు తన మనస్సు నొచ్చుకొన్నాడు. ఈవిధంగా పావురం శ్రీరాముని మనస్సును గాయపఅచిన వైనాన్ని అరుళాళప్పెరుమాళ్ ప్రస్తావించారు. వాస్తవానికి వేటగాడు శరణాగతి చేయకపోయినా, శరణ్యదేశప్రాప్తి– అంటే తాను ఉండే చెట్టు దగ్గరకు వేటగాడు రావడమే– శరణాగతిగా భావించి, పావురం ఇంత పని చేసింది. ఇక, సాక్షాత్ శరణాగతి చేస్తే చెప్పాలా ! ఇందువల్ల ఈ సందర్భాన్ని అరుళాళప్పెరుమాళ్ ప్రస్తుతించడం శరణాగతి వైభవం పట్ల వారికి గల అభిప్రాయాన్ని వ్యక్తం చేసినట్లు కాగలదు.

వార్తామాలై గ్రంథంలోని 124వ వార్త అరుళాళప్పెరుమాళ్ విషయంలో ధనుర్దాసు **(పిళ్ళై ఉఅఙ్గావిల్లి దాసర్)** కు ఉండే ప్రతిపత్తి విశేషాన్ని తెల్పుతున్నది.

శ్రీరంగంలోని విక్రమసింహచోళవీధిలో శ్రీరంగనాథుడు వేంచేసేటపుడు పిళ్ళై ఉఅఙ్గావిల్లిదాసర్ ప్రతిదినం ఆయుధాన్ని ఎత్తకుండా భగవానుని సేవించేవారు. దీనిని చూచి ఒకసారి అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ "కుఱ్ఱవాడా! నీ ఆయుధం ఎపుడు ఉపయోగపడుతుంది?" అని అడిగారు. అపుడు ఉఅఙ్గావిల్లిదాసర్ ''మీ అంజలి పవిత్రం (జలపవిత్రం) ఉపయోగపడినపుడు నా ఆయుధం ఉపయోగపడుతుంది'' అని చమత్కరిస్తూ బదులు పలికారట. అంటే– ఇంతటి ప్రతిపత్తితో దేవరవారు శ్రీరంగనాథుని సమీపంలో వేంచేస్తున్నపుడు తమ ప్రాణాలకు ముప్పు వాటిల్లేటట్లుగా నమ్బెరుమాళ్ విడచిపెట్టడు కనుక, తన ఆయుధానికి ఉపయోగం ఉండదు– అనే నిశ్చయంతో ఉఅఙ్గావిల్లి దాసర్ దానికి దృష్టాంతంగా "మీ అంజలి పవిత్రం కేవలం సన్న్యాసాశ్రమానికి చిహ్నంగా ఉండేటట్లే, నాకు ఈ ఆయుధం చిహ్నం మాత్రమే" అని ఈ సూక్తి భావం. దీనివల్ల ఉఅఙ్గావిల్లి దాసర్‌కు అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ పట్ల గల గౌరవాతిశయం వ్యక్తమవుతున్నది.

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాశిరియ ప్రబంధానికి ముందు అనుసంధించబడే **"కాశినియోర్ తామ్ వాళ"** అనే తనియన్ పాశురాన్ని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ రచించారు. దీనినిబట్టి వీరి ద్రావిడాభాషా పాండిత్యం సువ్యక్తమవుతున్నది. వీరి పాండిత్యాన్ని గూర్చి శ్రీవరవరమునులు ప్రమేయసార వ్యాఖ్యానావతారికలో ప్రారంభంలో **"సకలార్థనిపుణరాయ్"** ఇత్యాదిగా పల్కిన సూక్తులు స్పష్టం చేస్తున్నాయి.

శ్రీదేశికులు రహస్యత్రయసారమనే గ్రంథంలోని ద్వయాధికారంలో అరుళాళప్పెరుమాళ్ అనుగ్రహించిన మూడు కారికలను ఉట్టంకించారు. అవి ఈక్రింద తెలుపబడుతున్నాయి.

1. **ఆకారిణస్తు విజ్ఞాన మాకారజ్ఞానపూర్వకమ్ ।**
   **తేనాకారం శ్రియం జ్ఞాత్వా జ్ఞాతవ్యో భగవాన్ హరిః ॥**

(ఒక వస్తువుయొక్క నిరూపకవిశేషణాన్ని తెలిసిన పిమ్మటనే దానియొక్క అర్థాన్ని (జ్ఞానాన్ని) పొందడానికి వీలవుతుంది. అందువల్ల భగవానుని నిరూపక విశేషణమైన లక్ష్మినిగూర్చి తెలిసిన పిమ్మటనే విశేష్యభూతుడైన భగవానుని తెలియడం వీలవుతుంది.)

2. **స్వాభీష్టే పరసంబంధే స్వాశక్త్యా హీనసాధనః ।**
   **తత్ప్రాప్త్యుపాయం తత్పాదౌ కృత్వా విశ్వాసపూర్వకమ్ ॥**

(తాను పొందగోరే భగవత్ప్రాప్తికి తన అశక్తిచేత వేఱు ఏ సాధనాన్ని లేనివాడు, ఆ భగవానుని శ్రీచరణాలనే మహావిశ్వాస పూర్వకంగా ఉపాయంగా ఆశ్రయించాలి.)

3. **పరమాత్మని నారాణాం సర్వభారసమర్పణాత్ ।**
   **సంజాతం తైరపేక్ష్యం తు నమ ఇత్యుచ్యతే బుధైః ॥**

(భగవత్ప్రపన్నులు తమ అన్ని భారాలను భగవానుని సన్నిధిలో సమర్పించినందున, తమనుండి ఏ విధమైన ఉపాయానుష్ఠానాన్ని ఎదురు చూడనక్కఱ లేని స్థితి **"నమః"** అనే శబ్దంయొక్క అర్థంగా విజ్ఞులచే తెలుపబడుతున్నది.

ఈ మూడు కారికలు వీరి శాస్త్రవైదుష్యాన్ని జ్ఞానంలోని స్పష్టతను సూచిస్తున్నాయి.

గురుపరంపరా ప్రభావంలో వీరికి సంబంధించిన ఈ క్రింది తనియన్ శ్లోకాలు కన్పిస్తున్నాయి.

**దయాపాలనదేవాయ జ్ఞానసారప్రదాయ చ ।**
**ప్రమేయసారం దదతే నమోऽస్తు ప్రేమశాలినే ॥**

(అరుళాళప్పెరుమాళ్ అనే తిరునామాన్ని కలవారు, జ్ఞానసారం, ప్రమేయసారమనే గ్రంథాలను రచించినవారు, దయాస్వభావులైన మునివరులకు నమస్కారం.)

**యతిరాజదయాపాత్రం యతిపంక్తివిభూషణమ్ ।**
**దయాపాలమునిం వందే దేశికాగ్రేసరం తథా ॥**

(శ్రీరామానుజుల దయకు పాత్రులు, యతికులానికి గొప్ప అలంకారం వంటివారు, ఆచార్యులలో ముఖ్యులైన అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌ను నమస్కరిస్తున్నాను.)

**వాழ்த్తిరునామం**

**తిరు వాழ்ம் తెన్ అరఙ్గమ్ శిఱక్క వన్దోన్ వాழ்ியే**
**తెన్ అరుళాళర్ అన్బాల్ తిరున్దినాన్ వాழ்ియే**
**తరువాழ்ుమెతిరాశన్ తాళ్ అడైన్దోన్ వాழ்ియే**
**తమిழ் ఞాన ప్రమేయసారమ్ తమర్క్కురైప్పోన్ వాழ்ియే**
**తెరుళారు మధుకవినిలై తెళిన్దోన్ వాழ்ియే**
**తేశు పొలి మడమ్ తన్నై శిదైత్తిట్టాన్ వాழ்ియే**
**అరుళాళ మామునియామ్ ఆరియన్‌తాళ్ వాழ்ియే**
**అరుళ్ కార్త్తికై పరణియోన్ అనైత్తూழ் వాழ்ియే**

(సంపదకు నిలయమైన, దక్షిణదిక్కులోని శ్రీరంగం ప్రకాశించేటట్లు, అవతరించినవారికి మంగళం. దక్షిణ దిక్కులోని (అందమైన) వరదరాజస్వామి అనుగ్రహంవల్ల సంస్కరింపబడినవారికి మంగళం. శ్రీరామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించినవారికి మంగళం. ద్రావిడభాషలో జ్ఞానసార, ప్రమేయసారాలనే గ్రంథాలను శిష్యులకు పల్కినవారికి మంగళం. స్వచ్ఛమైన జ్ఞానాన్ని నిండుగా కల మధుకవుల ఆచార్యనిష్ఠను తెలిసినవారికి మంగళం. ప్రకాశించే తమ మతాన్ని

(తమకు ప్రత్యేకంగా మఠం ఉండరాదనే భావంతో) కూలగొట్టినవారికి మంగళం. అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ శ్రీచరణాలకు మంగళం. కార్తికమాసం భరణి నక్షత్రంలో అవతరించినవారికి కల్పాల తరబడి మంగళం.)

## ప్రమేయానుసారవ్యాఖ్యానమ్

తాము అనుష్ఠించిన చరమపర్వనిష్ఠను అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ జ్ఞానసార ప్రమేయసారాలనే రెండు ప్రబంధాల ద్వారా లోకానికి అందించారు. **"దేవరాజమునీంద్రశ్చ యతిరాజాజ్ఞయా తదా, చకార లోకరక్షార్థం స్ఫుటం ద్రావిడ భాషయా, ప్రబంధం జ్ఞానసారాఖ్యం సర్వశాస్త్రోపబృంహితమ్ అన్యం ప్రమేయసారాఖ్యం సమ్యగేతద్ద్వయం బుధః, గురురేవాత్ర శిష్యస్య పరదైవమతి ధ్రువమ్, గురుపాదాబ్జ కైంకర్యం పరమప్రాప్యమేవ హి, గురుం భగవతస్సాక్షాదవతారం విచింతయేత్, ఇత్యాదికాన్ విశేషార్థాన్ ఉక్తవాన్ శాస్త్రవిత్తమః"** అనే ప్రపన్నామృత గ్రంథంలోని వచనాలు స్మరణీయాలు. ఈ రెండు ప్రబంధాలకు విశదవాక్ శిఖామణి శ్రీవరవర మునులు అనుగ్రహించిన అన్యూనానతిరిక్తమైన, మధురమైన మణిప్రవాళవాఖ్య ఈ ప్రబంధాల గౌరవాన్ని ఇనుమడింపజేసింది.

ఈ ప్రమేయసారంలో అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ తాము వ్యక్తం చేసిన అర్థవిశేషాలన్నీ ఆచార్యపరంపరాప్రాప్తాలనే విషయాన్ని వారే స్వయంగా, మొదటి పాశురం లోని **"మీట్చియిల్లా నాట్టిరుప్పార్ ఎన్ఱిరుప్పన్ నాన్"** అనే ప్రయోగం ద్వారా సూచించారని వరవరమునులు వివరించడం ఒక మధురమైన అంశం. మొదటి పాశురంలో **"ఉవ్వానవర్"** అనే పదంతో ఆచార్యులను గ్రంథకర్త నిర్దేశించడం భగవద్రామానుజులు అనుగ్రహించిన అర్థవిశేషాలను అనుసరించి పల్కడమేనని తెలుపడం కూడా గమనార్హం. శ్రీరామానుజులు ముదలియాణ్డాన్‌కు ఉపదేశించిన అర్థవిశేషాలను వారు తమ కుమారులు కన్దాడై ఆణ్డాన్‌కు ఉపదేశించగా, వారు ఆ అర్థాలను ప్రణవసంగ్రహమనే గ్రంథంలో పల్కినట్లు, ఆ గ్రంథంలో ఉకారం ఆచార్యుని నిర్దేశిస్తున్నదని తెలుపబడినట్లుకూడా శ్రీవరవరమునులు వివరించారు. ఈవిధంగా ఆయా సందర్భాలలో వక్తవ్యాంశాలను వేనినీ విడువకుండా శ్రీవరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం సహృదయ భోగ్యం.

ఈ ప్రమేయసార వ్యాఖ్యానం తెలుగు, తమిళ లిపులలో ఇప్పటికి సుమారు 100 సంవత్సరాల క్రితం ముద్రింపబడింది. మళ్ళీ ముద్రింపబడినట్లు తోచదు.

శ్రీవరవరమునుల వ్యాఖ్యకు ఆంధ్రానువాదం రచింపబడిననట్లు కూడా తెలియ లేదు. అందువల్ల ఇప్పుడు ఆంధ్రానువాద సహితమైన వరవరమునుల ప్రమేయసార వ్యాఖ్యానగ్రంథం ఒకవిధంగా అపూర్వమైనదని చెప్పవచ్చు. ఈ గ్రంథముద్రణ ప్రపన్నపాఠకలోకాన్ని రంజింప చేయగలదని విశ్వసిస్తున్నాను. ఇటువంటి సాంప్రదాయిక గ్రంథాల ముద్రణవిషయంలో మిక్కిలి ఉత్సాహాన్ని చూపుతూ, నన్ను పదే పదే ప్రోత్సహించే ఆత్మీయులు, సికింద్రాబాద్‌లోని శ్రీరామానుజ సిద్ధాంత సభ అధ్యక్షులు, **ఉవే శ్రీమాన్ కె.కె.పరకాలన్ స్వామివారి** సన్నిధిలో కార్తజ్ఞ్య పురస్సరంగా ప్రణమిల్లుతున్నాను. తమ వయోభారాన్ని, అశక్తిని గణించకుండా నిరంతరం ఇటువంటి సద్గ్రంథాలను అందించాలనే తహతహ కల్గిన సహృదయులు, భగవద్భాగవతాచార్యకైంకర్య పరాయణులు **శ్రీమాన్‌స్వామిదాస్‌గారిని** హార్దికంగా అభినందిస్తున్నాను. ఈ గ్రంథాన్ని ముద్రించడానికి కావలసిన ద్రవ్యాన్ని భక్తిశ్రద్ధలతో సమర్పించిన ఆస్తికులు, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి శిష్యులైన **శ్రీమతి కదారి జయప్రద, శ్రీమాన్ కదారి లక్ష్మణరావుగారి దంపతులను** హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ ప్రయత్నంలో నన్ను ఆశీర్వదించి, మార్గదర్శకం చేసిన పితృ చరణులు, **న్యాయవేదాంత విద్వాన్ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి** సన్నిధిలో సవినయంగా ప్రణమిల్లుతున్నాను. ఈ గ్రంథాన్ని డిటిపి చేసి సహకరించిన **శ్రీమాన్ కె.ఇ.టి. లక్ష్మీనరసింహం స్వామివారికి, శ్రీచంద్రశేఖర్‌గారికి** ముద్రణ కార్యాన్ని అందంగా నిర్వహించిన **శ్రీహర్షవర్ధన్ గారికి** అనేక కృతజ్ఞతలు. నా అనువాదానికి **కీర్తిమూర్తులు, శ్రీవైష్ణవసింహ, ఉ.వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్** స్వామివారి ద్రావిడవివరణం ఉపయోగపడింది. ఆ స్వామివారికి అనేక హార్దిక కృతజ్ఞతలను సమర్పిస్తున్నాను. నా అనువాదంలో దొర్లిన లోపాలను సహృదయ పాఠకులు సహించి మన్నిస్తారని ఆశిస్తూ, స్వస్తి.

**శ్రీరామానుజసిద్ధాంతసభయా ముద్రితా భవేత్ ।**
**సేయం ప్రమేయసారస్య వ్యాఖ్యా సారవిదాం ముదే ॥**

ఇట్లు, నివేదించు
భాగవత విధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి
7-1-2015

శ్రీమతే రామానుజాయ నమః



అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్ద

# ప్రమేయసారమ్

### తనియన్

**నీఙ్గామలెన్దుమ్ నినైత్తు తొழுమిన్గళ్ నీణిలత్తీర్!,**
**పాఙ్గాగ నల్ల పిరమేయసారమ్ పరిన్దళిక్కుమ్,**
**పూఙ్గా వళమ్ పొழிల్ శూழ்పుదై వాழுమ్ పుదుప్పుళి మన్,**
**ఆఙ్గార మఱ్ఱు అరుళాళమాముని యమ్బుదమే**

---

## ప్రమేయసారమ్

### తనియన్

**నీఙ్గామలెన్దుమ్ నినైత్తు తొழுమిన్గళ్ నీణిలత్తీర్!,**
**పాఙ్గాగ నల్ల పిరమేయసారమ్ పరిన్దళిక్కుమ్,**
**పూఙ్గా వళమ్ పొழிల్ శూழ்పుదై వాழுమ్ పుదుప్పుళి మన్,**
**ఆఙ్గార మఱ్ఱు అరుళాళమాముని యమ్బుదమే**

విశాలమైన ఈ భూమిలో నివసించే జనులారా! జీవుని స్వరూపానికి తగిన ప్రమేయసారమనే ప్రబంధాన్ని ప్రీతితో అనుగ్రహించినవారు, పూల తోటలను, సమృద్ధిగా పెరిగిన పొదరిళ్ళను చుట్టూ కల చోట వాసం చేసేవారు, పుదుప్పుళి అనే నగరంలో ఉండేవారు, అహంకారం లేనివారైన అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ల అందమైన శ్రీచరణపద్మాలను ఎల్లప్పుడు విశ్లేషించకుండా ధ్యానించి నమస్కరించండి.



## విశదవాక్ శిఖామణి శ్రీమణవాళమామునిగళ్ అరుళిచ్చెయ్‌ద వ్యాఖ్యాన అవతారికై

సకలార్థనిపుణరాయ్, తత్త్వహిత పురుషార్థయాథాత్మ్యవిదగ్రేసరరాయ్, సమస్త సంసారిచేతనోజ్జీవనకామరాయ్, తమ్మై అడియిలే అంగీకరిత్తరుళిన ఎమ్బెరుమానార్ తిరువడికళిలే చిరకాలమ్ సేవై పణ్ణి, తత్త్వహితపురుషార్థవిశేషఙ్గళెల్లామ్ చరమ పర్వపర్యంతమాక అవర్ అరుళిచ్చెయ్య క్కేట్టు, తన్నిష్ఠరాయిరుక్కుమ్ అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్, తమ్ముడైయ పరమకృపైయాలే సంసారి చేతనోజ్జీవనార్థమాక సకలశాస్త్రఙ్గళిలుమ్ ఓరొరు ప్రదేశత్తిలే తాత్పర్యరూపేణ ప్రతిపాదిక్కప్పడుకైయాలే, సకలర్క్కుమ్ అఱియ అరిదామ్పడి ఇరుక్కిఱ అర్థవిశేషఙ్గళై సంగ్రహిత్తు, జ్ఞానసారమాకిఱ ప్రబంధముఖేన అరుళిచ్చెయ్‌దు తలైక్కట్టి, అనంతరమ్, సకలశాస్త్రసంగ్రహమాకైయాలే ప్రమాణసారమాన తిరుమంత్రత్తాల్ ప్రతిపాదిక్కప్పడుకిఱ ప్రమేయఙ్గళిల్ సారాంశత్తై

---

## ఆంధ్రానువాదం - అవతారిక

అష్టాక్షరీ మహామంత్ర రాజస్యార్థప్రకాశకః ।
గ్రంథః ప్రమేయసారాఖ్యో దయాపాలమునీరితః ॥

ద్రావిడ్యాం రమ్యజామాతృమునీంద్రైః వ్యాకృతః స్ఫుటమ్ ।
తద్వ్యాఖ్యామనుక్త్యాంధ్ర్యాం శింగరార్యో యథామతి ॥

అన్ని శాస్త్రాలలో సమర్థులై, తత్త్వ-హిత-పురుషార్థాలను యథాతథంగా గ్రహించినవారిలో ప్రముఖులులై, 'సంసారులందఱు ఉజ్జీవించాలి' అనే ఉదారమైన కోరికను కలవారై, తమను ముందుగా శిష్యునిగా అంగీకరించిన శ్రీరామానుజుల శ్రీచరణాలలో చిరకాలం కైంకర్యం చేసి తత్త్వహితపురుషార్థాల ప్రథమపర్వాన్ని, చరమపర్వాన్ని గూర్చి వారు పలుకగా ఆలకించి, అందులో నిష్ఠను కలవారు ఉండే అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్ వీరు. తమ కరుణాతిశయంతో, సంసారంలో పరిభ్రమించే చేతనులు ఉజ్జీవించడంకోసం శాస్త్రాలన్నిటిలోను వేర్వేరు చోట్ల పరమసారంగా చెప్పబడినవి, అందఱికి తెలుసుకోవడానికి దుర్లభంగా ఉండేవి గొప్ప (అ) అర్థాలను సంగ్రహించి జ్ఞానసారమనే గ్రంథాన్ని రచించి పూర్తి చేసిన తరువాత, శాస్త్రాలన్నిటికి సంగ్రహం అయినందున, ప్రమాణసారమైన

**సంగ్రహిత్తు, ఇప్ప్రబంధముఖేన అరుళిచ్చెయ్‌కిఱార్. ఆకైయిఱే ఇప్ప్రబంధత్తుక్కు ప్రమేయసారమెన్ఱు తిరునామమాయిఱ్ఱు.**

## వ్యాఖ్యానమ్

**1) ముదల్ పాట్టు– ఇదిల్, తిరుమంత్రత్తుక్కు సంగ్రహమాన ప్రణవత్తాలే ప్రతిపాదిక్కప్పడుకిఱ ప్రమేయత్తిల్ సారాంశత్తై అరుళిచ్చెయ్‌కిఱార్**

**వ్యాఖ్యానమ్– (అవ్వానవర్‌క్కు)–అకారవాచ్యనానవరుక్కు. "అ ఇతి బ్రహ్మ" ఎన్ఱు అకారత్తై బ్రహ్మశబ్దవాచ్యనోడే సమానాధికరిత్తు చ్చొలిఱ్ఱిఱే, శ్రుతి. అన్ద**

---

అష్టాక్షరిద్వారా చెప్పబడే ప్రమేయాలలోని సారార్థాన్ని ఈ గ్రంథంలో ప్రకాశింప జేస్తున్నారు. అందువల్లనే కదా! ఈ గ్రంథానికి **"ప్రమేయసారమ్"** అనే తిరునామం ఏర్పడింది.

**1. అవ్వానవరుక్కు మవ్వానవరెల్లామ్,**
**ఉవ్వానవరడిమై యెన్ఱురైత్తార్, ఇవ్వాఱు**
**కేట్టిరుప్పార్కాళెన్ఱు కణ్డిరుప్పార్, మీట్చియిలా**
**నాట్టిరుప్పార్ ఎన్ఱిరుప్పన్ నాన్**

"అకారార్థభూతుడైన భగవానునకు మకారార్థభూతులైన జీవాత్మలన్నీ శేషభూతులు" అని ఉకారార్థభూతురాలైన లక్ష్మీదేవితో సాటివచ్చే పురుషకారభూతులైన ఆచార్యులు వచిస్తారు. "ఈవిధంగా ఉపదేశంద్వారా విని, ఈ అర్థంలో ఊనికను కల్గి ఉండేవారికి దాసులై ఉండేవారము మనము" – అని తమను నిశ్చయించు కొన్నవారు పునరావృత్తి లేని పరమపదంలో వేంచేసి ఉంటారు – అని నేను నిశ్చయాన్ని పొందాను.

**అవతారిక–** ఈ మొదటి పాశురంలో – అష్టాక్షరీప్రమేయాన్ని సంగ్రహంగా పలికే ఆమంత్రంలోని మొదటి పదమైన ప్రణవంద్వారా చెప్పబడే ప్రమేయంయొక్క సారార్థాన్ని (అనన్యార్హశేషత్వాన్ని) అనుగ్రహిస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ : (అవ్వానవరుక్కు)** – అకారంతో నిర్దేశింపబడే సర్వేశ్వరునకు– అని అర్థం. **"అ ఇతి బ్రహ్మ"** (ఋగ్వేదము) (అ– అనబడే అక్షరం బ్రహ్మను

**సామానాధికరణ్యన్దాన్ వాచ్యవాచకసంబంధ నిబంధనమితే. "సమస్తశబ్దమూలత్వా దకారస్య స్వభావతః, సమస్తవాచ్యమూలత్వాత్ బ్రహ్మణోఽపి స్వభావతః, వాచ్యవాచక సంబంధః తయో రర్థాత్ప్రతీయతే" ఎన్నక్కడవదితే.**

**(మవ్వానవరెల్లామ్)-"మవ్వానవర్" ఎన్ఱు మకారవాచ్యరాన జీవాత్మాక్కళై చ్చొల్లుకిఱతు."మకారో జీవవాచకః" ఎన్నక్కడవదితే. ఇదుదాన్ ఏకవచనమాయిరున్దదే యాకిలుమ్, జాత్యేకవచనమాయ్ క్కొణ్డు సమష్టివాచకమాయిరుక్కైయాలే త్రివిధాత్మ వర్గత్తైయుమ్ శొల్లక్కడవదాయిరుక్కుమ్. ఆకైయాలే "మవ్వానవరెల్లామ్" ఎన్గిఱార్.**

**(ఉవ్వానవర్)- ఉకారవాచ్యరానవర్. ఇత్తాల్ ఆచార్యనై చ్చొల్లుకిఱతు. ఎజ్ఞనే? ఎన్నిల్, ఉకారమ్ లక్ష్మీవాచకమాక శాస్త్రసిద్ధమాకైయాలుమ్, అవళ్తనక్కు ఘటకత్వమ్**

---

నిర్దేశిస్తుంది) అనే రీతిలో **"అ"** అనే అక్షరాన్ని బ్రహ్మశబ్దంచేత చెప్పబడే సర్వేశ్వరునితో ఒకే విభక్తిలో వేదం పల్కింది కదా. ఈరీతిలో ఒకే విభక్తిలో పల్కడం అకారం బ్రహ్మను తెల్పుతున్నదని, బ్రహ్మ దానివల్ల చెప్పబడుతున్నాడని సూచించడంకోసమే కదా! **"సమస్త శబ్దమూలత్వాత్ అకారస్య స్వభావతః, సమస్తవాచ్యమూలత్వాత్ బ్రహ్మణోఽపి స్వభావతః,వాచ్యవాచకసంబంధః తయోరర్థాత్ ప్రతీయతే"** (వామనపురాణం) (సహజంగానే, అకారం అన్ని శబ్దాలకు మూలకారణమైనందున, సహజంగానే పరబ్రహ్మ అన్ని అర్థాలకు మూలకారణమై నందున, ఆ అకారానికి- పరబ్రహ్మకు మధ్య శబ్దార్థరూపమైన సంబంధం అర్థవశంచేత సిద్ధిస్తుంది.) అని చెప్పబడినదికదా!

**(మవ్వానవరెల్లామ్) "మ"** కారంతో చెప్పబడే జీవులను **"మవ్వానవర్"** అని నిర్దేశిస్తున్నారు. **"మకారో జీవవాచకః"** (మకారం జీవుని తెలిపే పదం) అని చెప్పబడుతున్నదికదా! **"మ"** కారం ఏకవచనమైనా, జీవసమూహాన్ని అంతటినీ అది లక్షిస్తున్నది.అంటే-నిత్యులు, ముక్తులు, బద్ధులు- అనే మూడు విధాలైన జీవులను లక్షిస్తున్నది. అందువల్ల **"మవ్వానవర్ ఎల్లామ్"** అని అంటున్నారు.

**(ఉవ్వానవర్)** ఉకారంచేత చెప్పబడేవారు-అని అర్థం. దీనిద్వారా ఆచార్యుడు నిర్దేశింపబడుతున్నాడు. ఏవిధంగా అంటే- **"ఉ"** కారం లక్ష్మిని తెల్పుతున్నదని శాస్త్రవచనంవల్ల తెలుస్తున్నది. ఆమె వైలక్షణ్యం(విలక్షణస్వభావం) పురుషకారత్వమే.

**స్వరూపమాకైయాలుమ్, ఆచార్యనుక్కుమ్ ఘటకత్వమే స్వరూపమాకైయాలుమ్, తత్ సామర్థ్యముణ్డాకైయాలే ఇవనుడైయ ఘటకత్వత్తుక్కు మూలమ్ అవళ్ తిరువడికళిన్ సంబంధవిశేషమాకైయాలే తత్ప్రయుక్తమాన ఐక్యముణ్డితే. అకైయాల్, తత్ సాధర్మ్యత్తాలుమ్, తత్ సంబంధప్రయుక్త తదైక్యత్తాలుమ్ ఆచార్యనై ఉకారవాచ్యనెన్గిఱదు.**

**ఎమ్బెరుమానార్ ఒరునాళ్ ఉకప్పిలే ముదలియాణ్డానుక్కు అరుళిచ్చెయ్‌దదాక అవరుడైయ కుమారరాన కందాడైయాణ్డాన్ భట్టరుక్కు అరుళిచ్చెయ్‌ద అర్థవిశేషఙ్గళెల్లామ్ ప్రతిపాదిక్కిఱ ప్రణవసంగ్రహమాకిఱ ప్రబంధత్తిలే ఆచార్యనై ఉకారవాచ్యనాక చ్చొల్లానిన్తతితే. ఇవరుమ్ ఎమ్బెరుమానార్ తిరువడికళిలే సేవిత్తవరాకైయాలే అవర్ అరుళిచ్చెయ్య క్కేట్టిరుక్కుమదుక్కొణ్డితే ఇప్పబంధత్తిలే ఇప్పడి అరుళిచ్చెయ్‌దదు.**

**(అడిమై ఎన్నురైత్తార్)–శేషమెన్ను అరుళిచ్చెయ్‌తార్. సంబంధజ్ఞానమ్ పిఱప్పిక్కై ఘటకకృత్యమితే. ఈశ్వరన్ శేషియాయ్, ఇత్తలై శేషమాయిరున్దాలుమ్, ఇస్సంబంధత్తై**

---

ఆచార్యనకు కూడా పురుషకారత్వమనేది విలక్షణస్వభావమే కనుక,ఈసామ్యాన్ని పురస్కరించుకొని, ఆచార్యుని పురుషకారానికి మూలం లక్ష్మీదేవి శ్రీపాదాలతో ఉండే సంబంధమే గనుక,సామ్యమున్నదిగదా! అందువల్ల ఆమెతో ఉండే సామ్యంవల్ల, ఆమెతో గల సంబంధం కారణంగా కల ఐక్యంవల్ల ఆచార్యుడు ఉకారంతో చెప్పబడినవాడయ్యాడు.

భగవద్రామానుజులు ఒకనాడు సంతోషంగా ముదలియాండానుకు అనుగ్రహించిన అర్థ విశేషాలను వారి కుమారులైన కందాడై ఆండాన్ భట్టరుకు తెలిపారు. ఆ అర్థవిశేషాలన్నీ ప్రతిపాదించే ప్రణవసంగ్రహమనే ప్రబంధం ఉన్నది. అందులో ఆచార్యుడు ఉకారవాచ్యుడుగా చెప్పబడ్డాడుకదా! **“ఇవరుమ్, ఎంబెరుమానార్ తిరువడిగళై సేవిత్తవరాకైయాలే అవర్ అరుళిచ్చెయ్య క్కేట్టిరుక్కుమదు క్కొణ్డితే ఇప్పబంధత్తిల్ ఇప్పడి అరుళిచ్చెయ్‌దదు”** (శ్రీరామానుజుల శ్రీచరణాలను సేవించిన వారైనందున వారు పలుకగా ఆలకించిన కారణంవల్ల కదా ఈ ప్రబంధంలో ఈ రీతిలో పలికారు) అనే శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానసూక్తి ఇక్కడ అనుసంధేయం.

**(అడిమై ఎన్ను ఉరైత్తార్)** – జీవులు అందఱు భగవానుని శేషభూతులని ఆచార్యులు పలికారు. జీవాత్మకు, పరమాత్మకు మధ్య గల సంబంధాన్ని తెలుపడం

**ఆచార్యన్ ఉపదేశత్తాలే ఉణర్త్తినపోదితే ఇవనుక్కు ప్రకాశిప్పదు. ఆకైయాలే "అవ్వానవర్క్కు మవ్వానవరెల్లామ్ అడిమై ఎన్ను ఉవ్వానవర్ ఉరైత్తార్"- ఎన్గిఱార్.**

**(ఇవ్వాఱు కేట్టిరుపార్క్కు)-ఇదుదాన్ ఉపదేశగమ్యమాకైయాలే ఇప్రకారత్తై ఉపదేశముఖత్తాలే కేట్టు తన్నిష్ఠరాయిరుప్పార్క్కు-ఎన్గిఱార్.**

**(ఆళెన్ను కణ్డిరుప్పార్)-అదావదు-అప్పడి ఇరుప్పార్క్కు శేషమెన్ను తఙ్గళై దర్శిత్తిరుక్కుమవర్కళ్ -ఎన్గై. కీழ్చ్చొన్న భగవచ్ఛేషత్వమ్, తత్కాష్ఠైయాన భాగవత శేషత్వపర్యన్తమాయిరుక్కైయాలేయితే ఇవర్ ఇప్పడి అరుళిచ్చెయ్దదు. తిరుమంత్రత్తిల్ పదత్రయత్తాలుమ్ ప్రతిపాదిక్కప్పడుకిఱ అనన్యార్హశేషత్వమ్ తదీయాన్వయ పర్యన్తమాయితే యిరుప్పదు. ఇదుదాన్ మూన్ను పదత్తిలుమ్ అర్థమాకవరు మిత్తనైయితే. ఆకైయాలే ఇప్పదత్తిల్ అర్థమాక ప్రతిపాదిక్కప్పడుకిఱ ఇత్తై అరుళిచ్చెయ్దారాయిற்று. ఆక, ఇప్పడి తఙ్గళై తదీయశేషత్వపర్యన్తమాక దర్శిత్తిరుక్కుమవర్కళ్.**

---

ఆచార్యుడు చేసే కృత్యం కదా! సర్వేశ్వరుడు వైకుంఠాన్ని పరిగ్రహించే స్వామియై, జీవుడు ఆ భగవానునకు శేషభూతుడై ఉన్నా, ఈసంబంధం ఆచార్యుడు తన ఉపదేశం ద్వారా శిష్యునకు తెల్పినపుడే అతనికి ప్రకాశిస్తుంది. అందువల్లనే, అకారంతో చెప్పబడేవానికి, మకారంతో తెలుపబడే జీవులు అందఱు శేషభూతులు-అని ఉకారం చేత చెప్పబడే ఆచార్యుడు పలికారు-అని అంటున్నారు.

**(ఇవ్వాఱు కేట్టిరుప్పార్క్కు)** - ఈ అర్థం ఉపదేశంవల్లనే శ్రవణం చేయాలి కనుక, దీనిని ఆచార్యుడు ఉపదేశించగా విని, అందులో నిష్ఠనుకలిగి ఉండేవారికి-అని అంటున్నారు.

**(ఆళెన్ను కణ్డిరుప్పార్)** - ఈవిధమైన నిష్ఠను కల్గినవారికి శేషం-అని తమను భావించేవారు - అని అర్థం. పూర్వం తెలుపబడిన రీతిలో భగవానునకు శేషమై ఉండడం- దాని చరమసీమ అయిన భాగవతులకు శేషమై ఉండే పర్యంతంగా ఉండడమని పల్కినందున, వీరు ఈరీతిలో తెల్పుతున్నారు. అష్టాక్షరీ మహామంత్రంలోని మూడు పదాలద్వారా చెప్పబడే అనన్యార్హశేషత్వం (భగవానునకు మాత్రమే శేషమై ఉండడం), అనన్య శరణత్వం (అతనినే రక్షకునిగా భావించి ఉండడం), అనన్యభోగ్యత్వం (అతని ఆనందంకోసమే కైంకర్యం చేయడం) -అనబడే మూడు ఆకారాలు అతని దాసులవరకు అనువర్తించడమేకదా! ఈ అర్థం అష్టాక్షరిలో

**(మీట్చియిల్లా నాట్టిరుప్పార్–ఎన్ఱు ఇరుప్పన్ నాన్)పునరావృత్తి యిల్లాద తిరునాట్టిలే పోయ్ అడియార్కళ్ కు*ழா*జ్గళుడన్ కూడియిరుక్కుమవర్కళ్–ఎన్ఱు ప్రతిపత్తి పణ్ణి యిరుప్పన్, నాన్. "నాన్"–ఎన్గైయాలే స్వప్రతిపత్తివిశేషత్తై అరుళిచ్చెయ్కిఱార్.**

**ఎమ్బెమానార్ తిరువడికళిలే సేవిత్తు సర్వజ్ఞరాయ్, పరమాప్తరాయిరుక్కైయాలే తామ్ అరుదియిట్టదే అర్థమెన్ఱు లోకమ్ పరిగ్రహిక్కుమ్బడియాన మదిప్పురాకైయాలేయితే "ఎన్ఱిరుప్పన్ నాన్"ఎన్ఱు అరుళిచ్చెయ్దదు.**

---

గల మూడు పదాలలోను తాత్పర్యార్థంగా వ్యక్తమౌతున్నదికదా! అందువల్ల **"ఆళెన్ఱు కణ్డిరుప్పార్"** అని అంటూ ఈవిధంగా తాత్పర్యార్థంగా స్ఫురిస్తున్నదని తెలిపారు. ఈరీతిలో తమను భగవద్భక్తులకు దాసులుగా భావిస్తారని తాత్పర్యం.

**(మీట్చియిల్లా నాట్టిరుప్పార్ ఎన్ఱిరుప్పన్ నాన్)** సంసారమండలానికి పునరావృత్తి లేని (తిరిగిరాని) పరమపదాన్ని చేరి, నిత్యుల, ముక్తుల సమూహంలో కలసి ఉంటారు–అని అంటూ అన్ని కాలాలలోనూ నేను భావిస్తాను– అని అంటున్నారు. **"నాన్"** (నేను)– అని పల్కినందున తమ భావనలోని దార్ఢ్యాన్ని తెలిపారు.

భగవద్రామానుజులచే సంస్కరింపబడి, వారికి శిష్యులై, అన్నిటిని తెలిసినవారై, చాలా విశ్వసనీయులై ఉన్నందున, తాము మనస్సులో నిశ్చయించుకొన్న విషయమే శాస్త్రాల తాత్పర్యం–అని లోకం అంగీకరించే రీతిలోని గొప్పతనాన్ని కలవారు అయినందువల్లనేకదా **"ఎన్ఱిరుప్పన్ నాన్"** అని (గ్రంథకర్త) అన్నారు.

**2. కుల మొన్ఱు ఉయిర్ పల తమ్కు*గ్ఱ*త్తాలిట్ట
కల మొన్ఱు కారియముమ్ వేఱామ్, పలమొన్ఱు
కాణామై కాణుమ్ కరుత్తార్ తిరుత్తాళ్గళ్,
పేణామై కాణుమ్ పి*ழై***

ఆత్మలు అనేకమైనా, ఆ ఆత్మలకు గల దాసకులమనేది ఒకటే. వీరికి భగవానుడు కర్మవశంగా ఇచ్చిన దేహంకూడా ప్రాకృత రూపమైనదే. అనుభవించే ఫలాలు వేర్వేరు. ఏవిధమైన ఫలాన్ని ఆశించకుండా కటాక్షించే మనస్సును కల్గిన ఆచార్యుని శ్రీచరణాలను ఆదరించి సేవించకపోవడమే దుర్గతికి మూలకారణమైన దోషం.

**2) అవతారికై : ఇరణ్డామ్ పాట్టు :- మకారవాచ్యరిల్-బద్ధచేతనరానవర్కళుక్కు సంసారమ్ ఒ*ழி*క్కుమాల్ శొల్లుకైక్కడి-సదాచార్య సమాశ్రయణమిల్లామై-ఎన్గిఱార్.**

**వ్యాఖ్యానమ్ (కులమొన్ఱు)-నిరుపాధికమాయ్,నిత్యమాయిరుక్కుమ్ కులమొన్ఱు.అదావదు కీ*ழ*చ్చొన్న శేషత్వమ్, "తొణ్డర్కుల"మితే.**

**(ఉయిర్ పల)-ఆత్మాక్కళ్ అనేకర్.అదావదు-అన్ద శేషత్వాశ్రయమాన ఆత్మాక్కళ్ అసంఖ్యాతర్ - ఎన్ఱై.**

**(తఙ్గ*ఱ్ఱ*గాత్తాలిట్ట కలమొన్ఱు) - అదావదు- తాఙ్గళ్ పణ్ణిన పుణ్యపాప కర్మమడియాక త్తఙ్గళై ఈశ్వరన్ ఇట్టు వైత్త శరీరమాకిఱ కలమొన్ఱు- ఎన్ఱై. తఙ్గ*ఱ్ఱ*గాత్తాలిట్ట కలమొన్ఱు- ఎన్ఱైయాలే- ఈశ్వరన్ ఇవ్వాత్మాక్కళై శరీరత్తిల్ విడువదు అవ్వవ్వరుడైయ కర్మఙ్గళై ఆరాయ్న్దు అదుక్కీడాక-ఎన్ను మిడమ్ శొల్లుకిఱదు. "కలమొన్ఱు"**

---

**2) అవతారిక** - మకారం ద్వారా చెప్పబడే మూడు విధాలైన జీవులలో సంసారంలో పరిభ్రమించే జీవులు (బద్ధులు) అనాది కాలంగా ఈరీతిలో పరిభ్రమించడానికి కారణం సదాచార్యుని ఆశ్రయించకపోవడమే-అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానమ్** - **(కులమొన్ఱు)** సహజమైనదై, నిత్యంగా ఉండే కులం అనేది ఒకటే ఉన్నది. అది - పూర్వం తెలుపబడిన దాసకులమే. **"తొణ్డర్క్కులమ్"** (దాసకులం) (తిరుప్పల్లాండు-5) అని అంటూ పెరియా*ழ*్వార్లు అన్నారుకదా!

**(ఉయిర్ పల)**- జీవాత్మలు అనేకులు. అంటే- ఆ శేషత్వానికి ఆశ్రయమైన జీవాత్మలు లెక్కలేనంత మంది- అని భావం.

**(తమ్ కు*ఱ్ఱ*త్తాలిట్ట కలమొన్ఱు)** - తాము చేసిన పుణ్యం, పాపం, - అనబడే రెండు విధాలైన కర్మల కారణంగా తమను సర్వేశ్వరుడు బంధించిన శరీరమనే పాత్ర -అని అర్థం. **"తమ్ కు*ఱ్ఱ*త్తాల్ ఇట్ట కులమ్"** అని అన్నందున సర్వేశ్వరుడు ఈ జీవాత్మలను శరీరంలో బంధించేటపుడు, ఆయా జీవులు చేసిన ప్రాక్తన కర్మలను గమనించి,దానికి తగినట్లుగా ఒక్కొక్క శరీరంలో ఒక్కొక్క సంసారి జీవుని కలుపుతాడు.-అని చెప్పబడుతున్నది. **"కలమ్ ఒన్ఱు"** అని అనడం- ఎందుకంటే? తిర్యక్-స్థావరాది చతుర్విధ జాతులు విభిన్నాలైనా, ఆయా జాతులలో

**ఎన్దదు దేవాదిజాతి భేదత్తాలుమ్, తత్తదవాన్తరభేదత్తాలుమ్ అనేకమాయిరున్దపోదిలుమ్, ఎల్లామ్ ప్రకృతి పరిణామరూప మెన్నుమదిల్ భేదమిల్లామైయాలే.**

**(కారియముమ్ వేఱామ్)–అన్ద దేహపరిగ్రహత్తాల్ కొళ్ళుమ్ కార్యముమ్ భిన్నమా యిరుక్కుమ్. కార్యమావదుదాన్ కర్మఫలానుభవమితే. అదు వేఱాకైయావదు– పుణ్యఫలానుభవముమ్, పాపఫలానుభవముమ్, ఉభయఫలానుభవమాయ్క్కొణ్డు వేఱుపట్టిరుక్కై. కారియముమ్ ఎన్దదు–కులమొన్ఱా ఇరుక్క తత్కార్యమాన ఫలానుభవముమ్ పలవకైప్పట్టిరుక్కుమెన్ను నినైత్తు, శేషత్వమే కులమాన ఆత్మాక్కళుక్కు పుణ్యపాపరూప కర్మసంబంధముమ్ ,అదడియాన దేహపరిగ్రహముమ్, అదిన్‌కార్యమాన సుఖదుఃఖాను భవముమ్ - ఇప్పడి ఒழுక్కరామల్ నడప్పానెన్? ఎన్నుమ్ ఆకాంక్షైయిలే అరుళిచ్చెయ్‌కిఱార్‌మేల్.**

---

ఉండే పలు విధాలైన విభాగాలవల్ల అవి అసంఖ్యాకాలై ఉన్నప్పటికీ, అన్ని శరీరాలు మూలప్రకృతియొక్క పరిణామరూపాలు –అనే విషయంలో ఏ భేదం లేనందున. ఆ విధంగా అన్నారు.

**(కారియముమ్ వేఱామ్)**– పూర్వం తెలిపిన భిన్నభిన్న శరీరాలను పరిగ్రహించిచేసే కార్యాలు కూడా వేఱు వేఱుగా ఉంటాయి. జీవాత్మలు చేసే కార్యాలు కూడా, చేసిన కార్యాల ఫలాన్ని అనుభవించడమే కాగలదు. ఆ ఫలానుభవం వేఱుగా ఉండడం అంటే – 1) పుణ్యఫలాన్ని అనుభవించడం, 2) పాపఫలాన్ని అనుభవించడం,3) పుణ్యపాపాలనే రెండిటి ఫలాన్ని అనుభవించడం– అని ఈ రీతిలో వేఱ్వేఱుగా ఉంటుంది. **"కారియముమ్"** –అని అనడం ఎందుకంటే– కులం ఒకటై ఉన్నా, జీవులు అనేకులైనట్లు, (వారి వారి) పాపాలవల్ల సర్వేశ్వరుడిచ్చిన పాత్రమనే శరీరం ప్రకృతికార్యమై, ఒకటిగా ఉన్నప్పటికీ దాని పరిణామాలైన ఫలాలను అనుభవించడం కూడా అనేక విధాలుగా ఉంటుంది– అనే భావంతో. "దాసకులమే సహజమైన కులమైనపుడు, జీవాత్మలకు పుణ్యం– పాపం అనబడే కర్మల సంబంధం, తత్కారణంగా కలిగే దేహసంబంధం, తత్ఫలంగా సుఖదుఃఖాలను అనుభవించడం–ఈ రీతిలో అనాదికాలంగా నిరంతరంగా ఎందుకు నడుస్తున్నది? అనే ప్రశ్న లేవగా, దానికి ఇక సమాధానాన్ని పల్కుతున్నారు..

**(ఫలమొన్టు) ఎన్టు తొడజ్గి. అదావదు– ఓరాత్మావై అంగీకరిక్కుమళవిల్, ఖ్యాతి లాభపూజైకళాకిఱ ఫలమొన్టిల్ కణ్ వైయాతే, ఇవ్వాత్మావినుడైయ ఉజ్జీవనమే ప్రయోజనమాక విశేషకటాక్షత్తై పణ్ణుమ్ నినైవై ఉడైయనాన ఆచార్యనుడైయ తిరువడికళై ఆశ్రయియామై కాణుజ్గోళ్. సంసారమ్ అవిచ్ఛిన్నమాయ్ చ్చెల్లుకైక్కుడియాన కు*ఱ్ఱ*మెన్గై పలమొన్టు కాణామై కాణుమ్ కరుత్తార్– ఎన్గైయాలే – ఆచార్యవైభవమ్ శొల్లుకిఱదు. తిరుత్తాళ్కళ్ పేణామై–ఎన్ఱ విడత్తిల్; పేణుకైయావదు– విరుమ్బుకైయాయ్, పేణామైయావదు– విరుమ్బామైయాకైయాలే, ఆశ్రయియామై చ్చొల్లుకిఱదు. పి*ழై* –కు*ఱ్ఱ*మ్.**

---

**(పలమొన్టు కాణామై కాణుమ్ కరుత్తార్ తిరుత్తాళ్కళ్ పేణామై కాణుమ్ పి*ழై*)** ఈసూక్తి భావమేమంటే – ఒక జీవాత్మను తన శిష్యునిగా అంగీకరించేటపుడు కీర్తికోసం గాని, ధనంకోసం గాని, పూజకోసం గాని పరిగ్రహించకుండా ఆ జీవాత్మ ఉజ్జీవించడమే ప్రధానోద్దేశ్యంగా భావించి,అతనిని కటాక్షించే భావనను కల ఆచార్యుని శ్రీచరణాలను శిష్యుడు ఆశ్రయించక పోవడమే కారణం. ఇదే ఈసంసార మండలం నిరంతరంగా వర్తించడానికి హేతువైన దోషం – అని భావం.**"పలమొన్టు కాణామై కాణుమ్ కరుత్తార్"** అని పల్కినందువల్ల ఆచార్యుని గొప్పతనం చెప్పబడింది. **"తిరుత్తాళ్కళ్ పేణామై"** అనే చోట **"పేణుకై"** –అనే పదం అభిమానించడమనే అర్థాన్ని తెల్పుతున్నది. **"పేణామై"** –అనే పదానికి అభిమానించక పోవడమని అర్థం కనుక, శిష్యులే ఆచార్యుని ఆశ్రయించక పోవడాన్ని ఈ పదం తెల్పుతున్నది. **"పి*ழై*"** – అంటే దోషం.

3. **పలజ్గణ్డు మీళాద పావ ముళదాగిల్,<br>కులజ్గణ్డు కారియమెన్? కూఱీర్, తలజ్గణ్ణ<br>తాళిణైయానన్టే తనై యొ*ழి*న్ద యావరైయుమ్<br>అళుడైయానన్టే యవన్.**

పాపం, నియమంగా (తప్పక) ఫలాన్ని ఇచ్చే స్వభావాన్ని కల్గినది అయితే, కులంవల్ల ఏమి ప్రయోజనం? చెప్పండి. అన్నిచోట్ల ఆక్రమించిన రెండు శ్రీచరణాలను కల్గిన భగవానుడు లోకాలను కొలిచిన కాలంలోనే స్వవ్యతిక్తసమస్త జీవులను (తనకంటే వేరైన జీవులను) అందరినీ శేషభూతులుగా చేసికొన్నాడు కదా!

**3) అవతారికై : మూన్ఱామ్ పాట్టు– ప్రయోజనాంతరప్రావణ్యమ్ నడక్కుమాకిల్, శేషత్వమాకిఱ కులమ్ కొణ్డు ఎన్న ప్రయోజనమ్? తిరువులకు అళన్దరుళిన సర్వేశ్వరన్ తత్కాలత్తిలే స్వవ్యతిరిక్త సమస్తాత్మక్కళైయుమ్ సంశ్లేషమాక వుడైయవనన్ఱో–ఎన్గిఱార్.**

**వ్యాఖ్యానమ్– (పలఙ్కొణ్డు మీళాద పావముళదాకిల్) ఐశ్వర్యాదికళిల్ ఏదేనుమొరు ఫలత్తై కొణ్డు వేణ్డా వెన్ఱాలుమ్, అదిల్ నిన్ఱు మీళామల్ ప*ఱ్ఱ్*రిరుక్కుమ్బడియాన పాపముణ్డా యిరుక్కుమాకిల్, అన్ఱిక్కే, పావమెన్దదు– భావమెన్దపడియాయ్, ఫలత్తై కొణ్డు, ఇదిల్ నిన్ఱుమ్ మీళామల్ ప*ఱ్ఱ్*రినిన్ఱుమ్బడియాన నినైవుణ్డాయిరుక్కుమాకిల్– ఎన్నవుమామ్.**

**(కులమ్ కొణ్డు కారియమెన్? కూఱీర్)– ప్రయోజనాంతరరుచి కిడక్కుమాకిల్, ఈశ్వరన్ ఇవ్వాత్మావై సంసారత్తిల్ తువక్కఱుత్తు త్తన్ తిరువడికళిల్ వాఙ్గామైయాలే, శేషత్వమాకిఱ కులత్తాల్ ఎన్న ప్రయోజనముణ్డు? శొల్లుఙ్గోళ్– ఎన్గై. అదు ఎన్?**

---

**అవతారిక –** సర్వేశ్వరుని కైంకర్యంలో తప్ప వేఱు ప్రయోజనాలలో ఆసక్తి ఉన్నట్లైతే,జీవాత్మలన్నిటికీ దాసకులం ఉన్నప్పటికీ ఏమి ఫలం? లోకాన్ని అంతటినీ త్రివిక్రముడై కొలిచిన సర్వేశ్వరుడు ఆ అవతార కాలంలోనే తనకు అన్ని జీవాత్మలు తనకు శేషభూతులై ఉన్న విషయాన్ని లోకాలను కొలిచిన లీలద్వారా ప్రదర్శించాడుకదా!–అని అంటున్నారు.

**(పలమ్ కొణ్డు మీళాదే పావముళదాకిల్)** – ఐశ్వర్యం, కైవల్యం – అనే రెండు ప్రయోజనాలలో ఏదో ఒక ఫలాన్ని ఆశించి, "ఇటువంటిది కోరకూడదు"– అని మంచిని కోరేవారు పలికినా, ఆ అల్పప్రయోజనాలలోని ఆసక్తిని విడచిపెట్టకుండా, వాటినే కోరి ప్రయత్నించే పాపమున్నట్లైతే –అని అర్థం. ఆరీతిలో కాకుండా, **"పావమ్"**–అనే పదాన్ని **"భావ"** శబ్దంగా గ్రహించి, "ఒక ఫలాన్ని ఆశించి, దానినుండి ఏనాటికీ నివర్తించకుండా అందులోనే నిలచి ఉండే రీతిలోని అభిప్రాయం ఉన్నట్లయితే"– అనే అర్థం కూడాచెప్పవచ్చు.

**(కులమ్ కొణ్డ కారియమ్ ఎన్ ? కూఱీర్)** అన్యఫలాలలో ఆసక్తి ఉన్నట్లయితే, సర్వేశ్వరుడు ఈ జీవాత్మను సంసారంనుండి విడిపించి తన శ్రీచరణాలలో చేర్చుకొనడు కనుక, ఆ జీవాత్మ దాసకులానికి చెందినవాడై ఉన్నప్పటికీ ఏమి ప్రయోజనం కల్గుతుంది?– అనేదానికి బదులు మీరే చెప్పండి– అని భావం. ఆ

**శేషత్వజ్ఞానముణ్డానాల్ ఇవన్ నమ్ముడైయవన్–ఎన్ఱు అభిమానిత్తు, ఈశ్వరన్ కారియమ్ క్కుడలాకాదో? ఎన్గిఱ శంకైయిలే అరుళిచ్చెయ్‌కిఱార్, మేల్**

**(తలమేన్ఱు తుడఙ్గి). (తలమ్ కొణ్డ తాళిణైయాన్) భూమియుమ్,ఉపరితనలోకము మాన సకలస్థలత్తైయుమ్ అళన్దుకొణ్డ తిరువడికళిరణ్డైయుమ్ ఉడైయవన్.**

**(అన్ఱే)–అప్పడి అళన్దుకొణ్డ అక్కాలత్తిల్,**

**(తన్నై యొఴిన్ద యావరైయుమ్ ఆళుడైయానన్ఱే అవన్)– తన్నై యొఴిన్ద సకలాత్మాక్కళైయుమ్ తనక్కడియాక ఉడైయవనన్ఱో అవన్–ఎన్గై. ఇత్తాల్– తిరువులకు అళన్దరుళినపోదు ఎల్లార్ తలైకళిలుమ్ తిరువడికళై వైత్తు, అప్పోదే ఎల్లారైయుమ్, తనక్కు చ్చేషమాక్కి క్కొణ్డానాక నినైత్తు సంతుష్టనాయ్ నిన్ఱవన్. ఇత్తైవరైయాక ఇవ్వాత్మాక్కళై సంసారత్తిల్ నిన్ఱుమ్ విడాదిరుక్కిఱదు, ఇవర్గళుడైయ అన్యపరతై యఴున్దనైయుమ్ పార్త్తిఱే. ఆకైయాల్ ఇవన్దనక్కు శేషత్వముణ్డానాలుమ్ ప్రయోజనాన్తరపరతై**

---

విధంగా అనడం ఎందుకు ? జీవునకు శేషత్వజ్ఞానం ఉంటే భగవానునకు తాను శేషమనే జ్ఞానం ఉంటే, "ఇతడు నా సొత్తు" అని అభిమానించి, అతడు (భగవానుడు) ఇతనిని (జీవుని) పరిగ్రహించవచ్చుకదా! అనే సందేహం కలుగగా, దానికి బదులిస్తున్నారు– **"తలమ్‌కొణ్డ"** –ఇత్యాదిగా.

**(తలమ్ కొణ్డ తాళిణైయానన్ఱో)** –

**(తలమ్ కొణ్డ తాళిణైయాన్)**–భూమి, దానిపై ఉండే లోకాలు –అనే సమస్తలోకాలను కొలిచిన రెండు శ్రీచరణాలను కలవాడు.

**(అన్ఱో)**– ఈవిధంగా కొలిచిన ఆ కాలంలో,

**(తన్నై యొఴిన్ద యావరైయుమ్ ఆళుడైయానన్ఱో అవన్)** తనను తప్ప అని జీవాత్మలను తనకు శేషంగా కలవాడుకదా, అతడు–అని అర్థం. ఇందువల్ల భగవానుడు త్రివిక్రముడై లోకాలను కొలిచినపుడు జీవాత్మలందఱి తలలపై తన శ్రీచరణాలను పెట్టి, అపుడే అందఱిని తనకు శేషభూతులుగా భావించి, ఆనందించాడు. ఆ స్వామి ఈనాటివరకు ఈ జీవాత్మలను ఈ సంసారంనుండి ఉద్ధరించకుండా ఉండడం (ఎందుకంటే) – "వీరు ప్రయోజనాంతరాలను ఆశించడం మానివేయనీ. అపుడు వీరిని పరిగ్రహిస్తాను" అని తలచినందువల్లకదా!

**యఱ్ఱిలొఱ్ఱియ ఇవనై సంసారత్తిల్ నిన్ఱుమ్ అవన్ ఎడామైయాలే, ప్రయోజనాన్తరరుచి కిడక్క ఉణ్డాన శేషత్వ జ్ఞానత్తాల్ ఎన్న ప్రయోజనముణ్డు? ఎన్ఱదాయిఱ్ఱు.**

**ఆక, మూన్ఱు పాట్టాలే ప్రణవార్థత్తై అరుళిచ్చెయ్‌దార్. ఇనిమేల్, నాలామ్ పాట్టాలే నమశ్శబ్దార్థత్తై అరుళిచ్చెయ్‌కిఱార్. నమస్సుక్కు అర్థమ్ అనన్యశరణత్వమితే. అదుక్కు ఉపయోగియాన అర్థవిశేషఙ్గళై ప్రతిపాదిత్తరుళుకిఱార్.**

**4) అవతారికై–నాలామ్పాట్టు– శేషియానవన్ తిరువడికళైత్తానే తరుకైయాల్ ఒఱ్ఱియ ఉపయాన్తరఙ్గళాల్ కాణ విరకుణ్డో?–ఎన్గిఱార్.**

---

అందువల్ల “జీవాత్మకు భగవచ్ఛేషత్వం ఉన్నప్పటికీ, అతడు ప్రయోజనాంతరాలను కోరడం మానివేస్తే తప్ప ఆజీవాత్మను సంసారంనుండి విడిపించడు. కనుక, ప్రయోజనాంతరాలను ఆశించేటపుడు కల్గిన శేషత్వజ్ఞానంతో జీవునకు ఏమి ప్రయోజనం ఉంటుంది? – అని అంటున్నారు.

ఈవిధంగా – మొదటి మూడు పాశురాలలో అష్టాక్షరిలో మొదటగల ఓంకారమనే ప్రణవంయొక్క అర్థాన్ని అనుగ్రహించారు. ఇకపై ఉండే నాల్గు పాశురాలలో అష్టాక్షరిలోని **“నమః”** అనే రెండవ పదం యొక్క అర్థాన్ని అనుగ్రహిస్తున్నారు. నమశ్శబ్దం యొక్క అర్థం– దానికి ఆవశ్యకమైన అర్థాలను అనంతర పాశురంలో వివరిస్తున్నారు.

**4. కరుమత్తాల్ ఞానత్తాల్ కాణుమ్ వగైయుణ్డే,**
**తరుమత్తాలన్ఱి యిఱైతాళ్‌గళ్, ఒరు మత్తాల్**
**మున్నీర్ కడైన్దాన్ అడైత్తాన్ ముదల్ పడైత్తాన్**
**అన్నీరమర్న్దానడి.**

మందరపర్వతమనే గొప్ప కవ్వంతో సముద్రాన్ని చిలికినవాడు, ఆ సముద్రములో సేతుబంధాన్ని చేసినవాడు, మొదట ఆ జలతత్త్వాన్ని సృష్టించినవాడు, ఆ నీటిలో శయనించినవాడైన భగవానుని శ్రీచరణాలను, ఆ భగవానుడు తానే తన శ్రీచరణాలను అనుగ్రహించడమనే పరగతస్వీకారంవల్ల తప్ప, స్వయత్నరూపమైన కర్మయోగ జ్ఞానయోగాదులతో దర్శించడం సాధ్యమా?

**అవతారిక –** సర్వస్వామియైన భగవానునియొక్క శ్రీచరణాలను,ఆ శ్రీచరణాలే తమను అనుగ్రహిస్తే తప్ప (ఇస్తే) భగవానుని ఒక్కని మాత్రమే ఉపాయంగా

**వ్యాఖ్యానమ్ – (కరుమత్తాల్ జ్ఞానత్తాల్ కాణుమ్ వకై యుణ్డో?) అదావదు– కర్మయోగత్తాలుమ్, జ్ఞానయోగత్తాలుమ్, భక్తియోగత్తాలుమ్ కాణుమ్ ప్రకారముణ్డో?– ఎన్నై. జ్ఞానత్తాల్ – ఎన్గిఅ ఇదిలే భక్తియుమ్ శొల్లుకిఱదు. "భక్తిశ్చ జ్ఞానవిశేషః" ఎన్గిఅపడియే అదుదాన్ జ్ఞానవిశేషమాకైయాలే, "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః" ఎన్నుమ్, "న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే " ఎన్నుమ్, "మన్మనా భవ మద్భక్తో భవ మద్యాజీ మానం నమస్కురు, మమేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః" ఎన్నుమ్ కర్మాదికళిల్ ఓరొన్రై భగవత్ప్రాప్తి హేతువాక శొల్లానిఱ్కుమ్. ఇవఱ్ఱిల్ కాణుమ్ వకైయుణ్డో? ఎన్ను ఇవర్ అరుళిచ్చెయ్దదు,**

---

పరిగ్రహించాలి కదా! స్వప్రయత్నరూపాలైన కర్మజ్ఞానభక్తియోగాలనే అన్యోపాయా లతో దర్శించడానికి అవకాశం ఉన్నదా?–అని అంటున్నారు.

**వ్యాఖ్యానమ్–(కరుమత్తాల్ ఞానత్తాల్ కాణుమ్ వగై యుణ్డో)**–దీని అర్థమేమంటే–కర్మయోగంతోను, జ్ఞానయోగంతోను, భక్తియోగంతోను దర్శించే దారి ఉన్నదా?అని భావం.**"ఞానత్తాల్"**–అనే పదంతో జ్ఞానంలోని ప్రకారవిశేషమైన భక్తికూడా చెప్పబడింది. **"భక్తిశ్చ జ్ఞానవిశేషః" (శ్రీభాష్యమ్)**–(భక్తి అనేది జ్ఞానంలోని ఒక ప్రకారం)–అనే రీతిలో భక్తి కూడా జ్ఞానంలోని ఒక ప్రకారంగా తెలుపబడింది కదా! **"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"** (గీత–3–20) (జనకుడు మొదలైనవారు జ్ఞానయోగముతో కాకుండా కర్మయోగంతోనే ఆత్మప్రాప్తి –అనే ఫలాన్ని పొందారుకదా!) అని, **"న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే, తత్ స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి"** (గీత–4–38) (ఈ లోకంలో శుద్ధిని కల్గించేది ఆత్మజ్ఞానంతో సమానమైనది ఇంకొకటి లేదు. ఇటువంటి జ్ఞానాన్ని పూర్వం తెల్పిన కర్మయోగసిద్ధిని పొందినవాడు, కాలక్రమంలో తన ఆత్మను పొందుతున్నాడు) అని, **"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః"** (గీత–9–3–4) ( నా పట్ల నిరంతరంగా మనస్సును నిలిపేవాడవు కావాలి. (అందులోను) నాపట్ల చాలా ప్రీతిని కలవాడవు కావాలి. (అందులోను) నన్ను ఆరాధించే వాడవుకావాలి. నన్ను నమస్కరించి, నన్నే గొప్ప శరణంగా కలవాడవై, ఈరీతిలో మనస్సును పరిణతిని పొందించుకోవడంద్వారా నన్నే పొందగలవు) అని కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం – అనే మూడింటిలో ఒక్కొక్క యోగాన్ని భగవానుని

**ఇవఱ్ఱినుడైయ స్వరూపత్తైయుమ్, భగవత్స్వభావత్తైయుమ్ తెళియ కణ్డవరాకైయాలే, ఇవై ఫలవ్యాప్తమాయ్ పోరుకిఱదు-ప్రాప్తి ఇవఱ్ఱుక్కు అఙ్గమాయ్ నిన్ఱు కార్యమ్ శెయ్దు కొడుక్కైయాలే-ఎన్ఱు కరుత్తు.**

**(తరుమత్తాలన్ఱి ఇఱైతాళ్ కళ్)-అదావదు-శేషియానవన్ తిరువడికళ్ తానే తరుకైయాకిఱ వఴియొఴియ - ఎన్ఱపడి. "ఇఱై" ఎన్ఱు ప్రథమపదత్తిల్ శొన్న అకారవాచ్యనాన శేషియై చ్చొల్లుకిఱదు. "తాళ్కళ్ తరుమత్తాలన్ఱి" ఎన్ఱదు-తిరువడి కళిలే ఉపాయమెన్గిఱ ప్రసిద్ధియాలే పూర్వవాక్యత్తాల్ ఉపాయవరణమ్ శొల్లుకిఱవళవిల్ "చరణౌ శరణం ప్రపద్యే"ఎన్నా నిన్ఱదిఱే."ఆఱెనక్కు నిన్ పాదమే శరణాక త్త న్దొఴిన్దాయ్"ఎన్ఱుమ్ "కఴల్కళవైయే శరణాక క్కొణ్డ"ఎన్ఱుమ్, "అడిమేల్ శేమఙ్గొళ్**

పొందడానికి సాధనంగా ప్రమాణాలు పల్కుతున్నాయి. వీటితో భగవానుని దర్శించే దారి ఉన్నదా? - అని వీరు అంటున్నారు. (ఎందుకంటే) జీవాత్మయొక్క పరతంత్రస్వరూపానికి ఇవి విరుద్ధాలు అయినందున, ఇవి లేకపోయినా కార్యం చేయగల్గిన భగవానిని గొప్పతనాలను స్ఫుటంగా దర్శించినవారైనందున, ఈమూడు యోగాలు కొంతమందికి ఫలాన్ని అనుగ్రహించడం ఎందుకంటే, భగవానుని మాత్రమే ఉపాయంగా భావించే ప్రపత్తి వీటికి అంగంగా నిలచి,ఫలాన్ని ఇస్తుంది కనుక-అని భావం.

**(తరుమత్తాలన్ఱి ఇఱై తాళ్కళ్)** - ఈసూక్తికి -స్వామి అయిన భగవానుడు తన శ్రీచరణాలు తానే అనుగ్రహిస్తే తప్ప-అని భావం. **"ఇఱై"** అనేది ప్రణవంలోని మొదటి పదమైన అకారానికి అర్థమైన భగవానుని తెల్పుతున్నది. **"తాళ్కళ్ తరుమత్తాలన్ఱి"**-అని అనడం ఎందుకంటే - శ్రీచరణాలే ఉపాయం-అని ప్రమాణం పల్కుతున్నందువల్ల. ద్వయంలోని మొదటి వాక్యంలోని ఉపాయాన్ని వరించేటపుడు **"చరణౌ శరణం ప్రపద్యే"** (శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను) అని చెప్పబడినదికదా! **"ఆఱెనక్కు నిన్ పాదమే శరణాక తన్దొఴిన్దాయ్"** (5-7-10) (నీ శ్రీచరణాలనే ఉపాయంగా నాకు అనుగ్రహించావు) అని , **"కఴల్కళ్ అవైయే శరణాక క్కొణ్డ"** (శ్రీచరణాలనే శరణంగా గ్రహించిన) (తిరువాయ్ -5-8-11) అని **"అడిమేల్ శేమఙ్గొళ్ తెన్ కురుకూర్ చ్చడకోపన్"** (తిరువాయ్-5-9-11) అని, **"శరణే శరణ్ నమక్కు"** (తిరువాయ్-5-10-11) (శ్రీచరణాలే మనకు శరణం) అని అంటూ భగవానుని శ్రీచరణాలే ఉపాయమనేది ఒకసారి కాకుండా

**తెన్‌కురుకూర్ చ్చడకోపన్"ఎన్హుమ్, శరణే శరణ్ నమక్కు" ఎన్హుమ్ తిరువడికళే ఉపాయమెన్హుమదై ఒరు కాల్‌పోలే పలకాలుమ్ ఆ*ழ்*్వార్ అరుళిచ్చెయ్‌దాతితే.**

**(ఒరుమత్తాల్ మున్నీర్ క్కడైన్దాన్)– దుర్వాసశాపోపహతరాయ్ వన్దు శరణమ్ పుకున్ద ఇంద్రాదికళుక్కాక మందరపర్వత మాకిఱ ఒరు మత్తాలే ఒరువరాలుమ్ కలక్క వొణ్ణాద జలసమృద్ధియుడైయ కడలై క్కడైన్దాన్.**

**(అడైత్తాన్)– "సీతాముఖకమలసముల్లాసహేతోశ్చ సేతోః" ఎన్గిఱపడియే పిరివాలే తళర్న్దు పిరాట్టిముఖకమలవికాసత్తుక్కాక నీరై క్కణ్డవాతే వెరువి యోడుమ్ కురజు క్కళైక్కొణ్డు నీరిలే అమి*ழ்*క్కదవ మలైకళాలే "అప్రమేయో మహోదధిః" ఎన్గిఱపడియే ఒరువరాల్ అళవిడ వొణ్ణాద ఆ*ழ*త్తైయుమ్, అకలత్తైయు ముడైత్తాన కడలై యడైత్తవన్.**

---

పలుమార్లు నమ్మా*ழ్*వార్లు అనుగ్రహించారుకదా !

**(ఒరు మత్తాల్ మున్నీర్ కడైన్దాన్)** –దుర్వాసుని శాపంవల్ల పీడింపబడి అన్ని సంపదలను కోల్పోయి, భగవానుని ఆశ్రయించిన ఇంద్రాదిదేవతలకోసం మందరపర్వతమనే సాటి లేని కవ్వంతో ఎవరికీ చిలకడానికి సాధ్యం కాని నీటి సమృద్ధి కల పాలకడలిని చిలికాడు.

**(అడైన్దాన్) – "ఆశైలాదద్రికన్యాచరణకిసలయన్యాసధన్యోపకంఠాత్, ఆరక్షోనీత సీతాముఖకమలసముల్లాసహేతోశ్చ సేతోః, ఆచప్రాచ్యప్రతీచ్యక్షితిధరయుగళాత్ అర్కచంద్రావతంసాత్ మీమాంసాశాస్త్రయుగ్మశ్రమవిమలమనా మృగ్యతాం మాదృశోఽన్యః"** (యామునుల ముక్తకం) (పర్వత రాజపుత్రిక అయిన పార్వతియొక్క చిగురుటాకువంటి పాదాల ముద్రలతో గొప్పగా వెలిగే కొండచరియలను కల హిమాలయపర్వతంనుండి, రాక్షసులచే అపహరించబడిన సీతాదేవియొక్క ముఖపద్మం వికసించడానికి కారణమైన సేతువు, చంద్రసూర్యులను ఇద్దఱిని శిరోభూషణంగా కల్గిన ఉదయగిరికి, అస్తమయగిరికి – అననే వీటిమధ్య భాగంలో పూర్వమీమాంస, ఉత్తరమీమాంస –అనే రెండు శాస్త్రాలలోను విశేషమైన పరిశ్రమలతో ఏదోషం లేని మనస్సు కల నావంటివాడు ఇంకొకడున్నాడేమో! అన్వేషించండి.) అనే విధంగా శ్రీరాముని విశ్లేషించినందున వికాసాన్ని కోల్పోయిన సీతాదేవి ముఖపద్మం వికసించడంకోసం నీటిని చూస్తే భయపడి పరుగు తీసే వానరాలతో నీటిలో మునిగిపోయే శిలలతో **"అప్రమేయో మహోదధిః"** (రామా–

**(ముదల్ పడైత్తాన్)– కరణకళేబరవిధురరాయ్, భోగమోక్షశూన్యరాయ్ క్కిడన్ద సంసారిచేతనరైకరణ కళేబరప్రాప్తియాలే భోగమోక్షభాగికళాక్కుకైక్కాక, "అప ఏవ ససర్జాదౌ" ఎన్గిఱపడియే ఆదియాలే జలతత్త్వత్తై సృష్టిత్తవన్.**

**(అన్నీరమర్న్దాన్)– సృష్టరాన ఇవర్కళుడైయ రక్షణార్థమాక "వెళ్ళత్తడమ్ కడలుళ్ విడనాకణైమేల్ మరువి" ఎన్గిఱపడియే అన్ద జలత్తిలే కణ్వళర్న్దరుళినవన్.**

**(అడి)– అవనుడైయ తిరువడికళై. ఇత్తాల్ – ప్రయోజనాంతరపరరాయ్,**

---

యుద్ధ–11–34) (మహాసముద్రం అంతు లేనిది) అనే రీతిలో ఎవరికీ ఇంతటిది– అని కొలువడానికి వీలుకాని గాంభీర్యాన్ని, వైశాల్యాన్ని కల ఈ సముద్రాన్ని దాటినవాడు.

**(ముదల్ పడైత్తాన్)–** శరీరాలను, ఇంద్రియాలను లేనివారై, ఇహలోక సంబంధాలను కాని, మహానందమనబడే మోక్షానందాన్నిగాని పొందనివారై అచిత్కల్పంగా పడి ఉండి, సంసారంలో బంధింపబడి ఉండే జీవులకు శరీరాన్ని, ఇంద్రియాలను ఇచ్చి, వారు ఈ లోకంలోని ఆనందాలను,మహానందాన్ని అనుభవించగలిగేవారు కావడంకోసం **"ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్, అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః,.... సోఽభిధ్యాయ శరీరాత్ స్వాత్ విసృక్షు ర్వివిధాః ప్రజాః, అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మపాసృజత్"** (మను–15–8) (ఈలోకం తమస్సులో లయించి ఉన్నందున ప్రత్యక్షం కానిదిగా, అనుమానంతో తెలియబడనిదిగా, శబ్దంద్వారాకూడా తెలియబడనిదిగా, ఏరీతిలోను కార్యం చేయలేనిదిగా, సృష్ట్యారంభంలో ఉన్నది...... ఆ పరమాత్మ పలు విధాలైన జీవులను సృష్టించగోరి, సంకల్పించి, తన శరీరంనుండి జలాన్ని ముందుగా సృష్టించాడు. అందులో జీవుడనే విత్తును విడిచాడు) అనే రీతిలో సృష్టికాలంలో నీటిని సృష్టించినవాడు.

**(అన్నీర్ అమర్న్దాన్)** – సృష్టింపబడిన జీవులను రక్షించడంకోసం **"వెళ్ళత్తడజ్గడలుళ్ విడనాకణై మేల్ మరువి"** (తిరువాయ్–7–8–4) (ప్రవాహాన్ని కల, చల్లని కడలిలో విషాన్ని కల ఆదిశేషుడనే పడకపై ఆదరంతో శయనించి) అనే రీతిలో ఆ నీటిలోనే శయనించినవాడు.

**(అడి)** అతని శ్రీచరణాలను –అని అర్థం. దీనివల్ల మిగిలిన (అన్య)

**ఇన్ఱు ఆశ్రయిత్త దేవర్‌కళోడు నిత్యాశ్రితైయాన పిరాట్టియోడు,నిత్యసంసారికళాన చేతనరోడు వాశియఱ ఎల్లారైయుమ్ రక్షిత్తవనుడైయ తిరువడికళై-ఎన్గై. "ఒరు మత్తాల్"ఎన్ఱు తొడఙ్గి "అన్నీరమర్న్దానడి ఇఱైత్తాళ్‌కళ్ తరుమత్తాలన్ఱి క్కరుమత్తాల్ ఞానత్తాల్ కాణుమ్ వకైయుణ్డో?" ఎన్ఱు అన్వయమ్.**

**5) అవతారికై-అఙ్జామ్ పాట్టు :- సిద్ధోపాయత్తిన్ పడియై క్కణ్డాల్ ఉపాయయాన్తరఙ్గళై సవాసనమాక విట్టు, అదుతన్నిలుమ్, తన్నుడైయ స్వీకారత్తిలుమ్ ఉపాయ బుద్ధియఱ్ఱు, త్తన్ వెఱుమైయై అనుసంధిత్తిరుక్కుమదు సర్వేశ్వరనుడైయ కృపాఫల మెన్గిఱార్.**

---

ప్రయోజనాలను కోరేవారై, ఆ ప్రయోజనాలను పొందడంకోసం భగవానుని పొందిన దేవతలతో, ఎల్లప్పుడు అతనిని ఆశ్రయించి, సంశ్లేషించి ఉండే లక్ష్మీదేవితో, సదాసంసారంలో మునిగి ఉండే జీవులతోపాటు ఏతేడా లేకుండా, అందఱిని రక్షించిన జీవులను – అని భావం. **"ఒరు మత్తాల్ మున్నీర్ కడైన్దాన్"** (అద్వితీయమైన కవ్వంతో మూడు విధాలైన నీటిని కల సముద్రాన్ని చిలికాడు ) అని ఆరంభించి, **"అన్నీర్ అమర్న్దాన్ అడి ఇఱైతాళ్‌కళ్ తరుమత్తాలన్ఱి క్కరుమత్తాల్ ఞానత్తాల్ కాణుమ్ వకై యుణ్డో!"** అని పాశురాన్ని అన్వయించి అర్థాన్ని చెప్పాలి.

**5. వఴియావదు ఒన్ఱెన్ఱాల్ మఱ్ఱవైయుమ్ ముఱ్ఱుమ్,**
**ఒఴియా అదు ఒన్ఱెన్ఱాల్ ఓమెన్ఱు, ఇఴియాతే**
**ఇత్తలైయాల్ ఏదుమిల్లై ఎన్ఱిరున్దదుదాన్,**
**అత్తలైయాల్ వన్ద అరుళ్**

"ప్రాప్తికి సాధనమైనది సిద్ధోపాయం ఒక్కటే" – అని అంటే, దానికి అంగీకరించి, "మిగిలిన ఉపాయాలన్నీ పూర్తిగా విడచిపెట్టి, ఆ సిద్ధోపాయంలోనే నిలకడగా ఉండు" అని అంటే దానికికూడా సమ్మతించి, చేతనుని ప్రయత్నంవల్ల సిద్ధించేది ఏదీ లేదని నిశ్చయించుకోవడం అనేది సర్వేశ్వరుని కృపవల్ల కల్గుతుంది.

**అవతారిక-** సిద్ధోపాయరూపుడైన భగవానుని స్వభావాన్ని గమనిస్తే- సాధ్యోపాయాలైన అన్యోపాయాలను పూర్తిగా విడచిపెట్టి, అందులోను, **"తాన్ పఱ్ఱుమ్ పఱ్ఱు ఉపాయమ్"** (తాను చేసే ఆశ్రయణం ఉపాయం) అనే అభిప్రాయాన్ని విడచి, తన దగ్గద ఏమీ లేదు-అని భావించడం సర్వేశ్వరుని కరుణయొక్క ఫలంగా కల్గింది-అని ఈ పాశురంలో అంటున్నారు.

వ్యాఖ్యానమ్– (వ*ర్రి*యావదొన్టెన్టాల్)–ఉపాయమావదొన్టెన్టాల్. అదావదు– కర్మజ్ఞానభక్తిప్రపత్తికళెన్ఱు నాలుపాయమాక శాస్త్రమ్ శొల్లి*ఞ్ఞె*యాకిలుమ్, కర్మాదియాన ము*ఞ్ఞు*మ్, కార్యసిద్ధియిల్ ఈశ్వరన్ కైపార్త్తిరుక్కుమవైయాకైయాలే, అవ*ఞ్ఞు*క్కు సాక్షాదుపాయత్వమిల్లై. ఆనపిన్బు సాక్షాదుపాయమావదు– చతుర్థోపాయమెన్ఱొన్ఱు శొన్నాల్–ఎన్గై.

(మ*ఞ్ఞ*వైయుమ్ ము*ఞ్ఞు*మొ*ర్రి*యా)– అదావదు– "సర్వధర్మాన్ పరిత్యజ్య" ఎన్గిఅపడియే మ*ఞ్ఞు*ముణ్డాన ఉపాయాంతరఙ్గళెల్లావ*ఞ్ఞై*యుమ్ ఒన్ఱొ*ర్రి*యామల్ విట్టు–ఎన్గై. "మ*ఞ్ఞ*వైయుమ్"ఎన్ఱు సిద్ధోపాయవ్యతిరిక్తమాన సకలోపాయఙ్గళై చ్చొల్లుకిఅదు. "ము*ఞ్ఞు*మ్" ఎన్ఱు అవ*ఞ్ఞై* విడుమ్బోదు నిశ్శేషమాక విడవేణుమెన్గిఅదు. "ఒ*ర్రి*యా" ఎన్ఱదు– ఒ*ర్రి*న్డెన్ఱపడియాయ్, పరిత్యజిత్తు–ఎన్ఱపడి.

(అదొన్టెన్టాల్)– అన్ద సిద్ధోపాయమానదు "ఏక" పదత్తిల్ శొల్లుకిఅపడియే చేతనరుడైయ స్వీకారత్తిల్ ఉపాయబుద్ధియైయుమ్ సహియాదపడి అద్వితీయమెన్టాల్,

---

వ్యాఖ్యానమ్ : (వ*ర్రి*యావదు ఒన్టెన్టాల్) – ఉపాయమనేది ఒకటి అంటే– అని అర్థం. దీని భావమేమంటే–కర్మయోగం, జ్ఞానయోగం,భక్తియోగం, ప్రపత్తి– అనే నాల్గు ఉపాయాలను శాస్త్రాలు పల్కినప్పటికీ, మొదటి మూడు ఉపాయాలు, వాటిద్వారా మోక్షం సంభవించేటపుడు, అవి సర్వేశ్వరుని అనుగ్రహాన్ని అపేక్షిస్తాయి. కనుక, అవి సాక్షాదుపాయాలు కావు. అందువల్ల, సాక్షాదుపాయం నాల్గవ ఉ పాయమైన ప్రపత్తియే–అని పలికితే–అని అర్థం.

(మ*ఞ్ఞ*వైయుమ్ ము*ఞ్ఞు*మ్ ఒ*ర్రి*యా ) – అంటే –"సర్వధర్మాన్ పరిత్యజ్య" (గీత–18–66) (ఫలసాధనాలైన అన్ని ధర్మాలన్నింటిని సవాసనగా విడచిపెట్టి ) అనే రీతిలో మిగిలిన ఉపాయాలను అన్నింటినీ విడచిపెట్టి –అని అర్థం. **"మ*ఞ్ఞ*వైయుమ్"** అనేది సిద్ధోపాయం కంటే వేఱయిన అన్ని ఉపాయాలను తెల్పుతున్నది. **"ము*ఞ్ఞు*మ్"** అనే పదం వాటిని విడిచేటపుడు పూర్తిగా విడచిపెట్టాలని తెల్పుతున్నది. **"ఒ*ర్రి*యా"** అనేదానిని **"ఒ*ర్రి*న్డు"** అని గ్రహించి, "విడచిపెట్టి" అనే అర్థాన్ని చెప్పాలి.

**(అదు ఒన్టెన్టాల్)** – ఆ సిద్ధోపాయం కర్మయోగంలో **"మామ్ ఏకమ్"** (శ్రీకృష్ణ చరమశ్లోకం) (నన్ను ఒక్కని మాత్రమే) అనే చేటగల **"ఏక"** అనే

**(ఓమెన్ఱు)–ఉడన్‌పట్టు,**

**(ఇ*ల్లా*యాదే)– నమ్ముడైయ స్వీకారముణ్డానాలన్ఱో, అదు కార్యకరమావదు–ఎన్ఱు అవ్వ*ల్లా*యాలే తాన్ ఇవ్వుపాయత్తుక్కుళ్ ఇ*ల్లా*యాదే,**

**(అత్తలైయాల్ వన్ద అరుళ్) – "అళివరుమరుళ్" ఎన్గిఅపడియే నిర్హేతుకమాక అవన్ తన్ నినైవాలే వన్ద కృపైయినుడైయ ఫలమెన్గై.**

---

పదంతో తెలుపబడిన రీతిలో, చేతనుడు, తాను చేసే ఆశ్రయణం (ప్రపత్తి) ఉపాయమనే భావనను కల్గి ఉండడం సహించలేని రీతిలో అద్వితీయంగా ఉ న్నదని అంటున్నారు.

**(ఓమ్ ఎన్ఱు)** –అంగీకరించి –అని అర్థం.

**(ఇ*ల్లా*యాదే)** – "మనం ఆశ్రయిస్తే కదా సిద్ధోపాయమనే భగవానుడు మోక్షాన్ని ఇస్తాడు"అనే అభిప్రాయంతో సిద్ధోపాయాన్ని ఆశ్రయించకుండా –అని అర్థం.

**(ఇత్తలైయాల్ ఏదుమిలై ఒన్ఱు ఇరున్దదు తాన్)** – ఈ ఫలానికి (మోక్షానికి) కారణంగా చెప్పదగినది జీవుని ప్రయత్నరూపంలో ఏదీ లేదు. – అని భావించిన ఆ స్థితికూడా,

**(అత్తలైయాల్ వన్ద అరుళ్ ) "అళివరుమ్ అరుళ్ "** (తిరువాయ్–1–3–2) అనే రీతిలో ఏకారణం లేకుండా సర్వేశ్వరుని సంకల్పంతోనే కల్గిన కృపయొక్కఫలం– అని భావం. ఇక్కడ **"అరుళ్"** అనే పదం కృపాఫలమైన యోక్షాన్ని తెల్పుతున్నది.

**6. ఉళ్ళపడి యుణరిల్ ఒన్ఱు నమక్కుణ్డెన్ఱు,**
**విళ్ళవిరగిలదాయ్ విట్టదే, కొళ్ళ**
**క్కుఱై యేదు మిల్లార్క్కు క్కూఱువదెన్? శొల్లీర్,**
**ఇఱైయేదు మిల్లాద యామ్**

ప్రాప్యానికి అనుగుణమైన పరగతస్వీకారం అనేది మనకు ఉన్నది అని యథార్థంగా తెలిసికొంటే, అతనిని విడచి తొలగిపోయే దారి లేదుకదా! మనం ఏవిధమైన ప్రయత్నాన్ని చేయనక్కఱలేని రీతిలో ఏ కొఱత లేకుండా ఉండే

**6) అవతారికై– ఆణామ్ పాట్టు– స్వరూపయాథాత్మ్యదర్శియాయ్, ఇవ్వుపాయత్తిల్ అధికరిత్తవన్ అనుసంధిత్తిరుక్కుమ్ ప్రకారత్తై స్వగతమాక అరుళిచ్చెయ్‌కిఱార్**

**వ్యాఖ్యానమ్– (ఉళ్ళపడి యుణరిల్)–స్వరూపత్తై ఉళ్ళపడి దర్శిక్కిల్. అదావదు– జ్ఞాతృత్వకర్తృత్వాదికళోడుమ్, శేషత్వత్తోడుమ్ కూడియిరుక్కిఱ మేలెழுన్ద ఆకారత్తై విట్టు దర్శిక్కై యన్ఱిక్కే, స్వరక్షణే స్వయత్నగంధాసహమాన పారతంత్ర్యమే వడివాన అవ్వళవుమ్ శెల్లదర్శిక్కిల్ – ఎన్ఱపడి.**

**(ఒన్ఱు నమక్కుణ్డెన్ఱు విళ్ళ విరకిలదాయ్ విట్టదే)– పేఱ్ఱుక్కుడలానదొన్ఱు నమక్కుణ్డెన్ఱు వాయ్‌విడుకైక్కు వழியఱ్ఱువిట్టదే– ఎన్ఱై. అన్ఱిక్కే, విళ్ళుకైయావదు–**

---

సర్వేశ్వరునకు అకించనులమైన మనం ప్రార్థనారూపంగా విన్నవించవలసినది ఏమున్నది? విజ్ఞులారా! చెప్పండి.

**అవ** – తన స్వరూపాన్ని యథాతథంగా తెలిసినవాడై, ఈ సిద్ధోపాయమైన భగవానుని ఆశ్రయించినవాడు ఏవిధంగా భావించాలి? –అనే దానికి తమను ఉద్దేశించి తామే బదులు పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్– (ఉళ్ళపడి ఉణరిల్)** –తన స్వరూపాన్ని యథాతథంగా దర్శిస్తే– అని అర్థం. అంటే– జ్ఞాతృత్వం (జ్ఞాతయై తెలిసేవాడై ఉండడం), కర్తృత్వం (క్రియను చేసేవాడై ఉండడం) మొదలైన వాటితో పాటు భగవానునకు శేషభూతుడై ఉ ఒడడం– అనే శేషత్వంతో కూడి ఉండే, పైపైన స్ఫురించే స్వభావాలను మాత్రం పురస్కరించుకొని తమ స్వరూపాన్ని దర్శించడం మాత్రంకాకుండా, తనను రక్షించడంలో తన ప్రయత్నంయొక్క వాసనను కూడ సహించనిదై ఉండడమే తమ స్వరూపం–అనే పర్యంతం దర్శిస్తే–అని భావం.

**(ఒన్ఱు నమక్కు ఉణ్డెన్ఱు విళ్ళ విరకిలతాయ్ విట్టదే)**– పరమపదాన్ని చేరి, భగవానునకు కైంకర్యం చేయడమనే ప్రాప్యానికి కారణం అనేది మనకు ఉన్నది– అని నోరు తెరవడానికి (పల్కడానికి) దారి లేకుండా పోయిందే–అని భావం. **“విళ్ళ”** అనే పదం నోరు తెరవడాన్ని తెల్పుతుంది. ఆరీతిలో కాకుండా, **“విళ్ళ”**– అనే పదం తొలగడమనే అర్థాన్ని తెల్పుతున్నదై, భగవానుని అభిమానంలో ఒదిగి ఉండడం తప్ప, అతనిని పొందడంకొసం మనం చేయవలసినది ఒకటి ఉన్నది

**నీఙ్గుకైయాయ్, అవనభిమానత్తిల్ ఒదుఙ్గి క్కిడక్కుమదొ*ౘ్ౙి*య పే*ఱ్ఱు*క్కుడలాక నమక్కొన్ఱు పిరియ నిఙ్ఙ విరక*ఱ్ఱు* విట్టదే- ఎన్నవుమామ్.**

**అదువెన్? నమక్కు రక్షకనానాలుమ్ "రక్ష మామ్" ఎన్గిఱపడియే ఓరుక్తిమాత్రమ్ పణ్ణుమ్ ఇవనుమ్ శొల్లవేణ్డావో? ఎన్గిఱ శంకైయిలే అరుళిచ్చెయ్ కిఱార్,మేల్.**

**(కొళ్ళక్కుఱై ఏదు మిల్లోర్క్కు) - తాన్ రక్షిక్కుమిడత్తాల్ నమ్ పక్కల్ ఉళ్ళదొన్ఱైయుమ్ కూట్టిక్కొళ్ళవేణ్డాదపడి నిరపేక్షరానవర్క్కు.**

**(ఇఱైయేదు మిల్లాద యామ్) - ఆత్మావోడు, ఆత్మీయఙ్గళోడు వాశియఱ సకలముమ్, అఙ్గుత్తైక్కు శేషమాకైయాలే ఏకదేశము మొన్ఱుమిల్లాద నామ్,**

**(కూఱువదెన్ శొల్లీర్)- "నమ్మై రక్షిక్కైక్కుడలాక అవరై క్కుఱిత్తు చ్చొల్లువదెన్? శొల్లుఙ్గోళ్"- ఎన్ఱు సన్నిహితరై ప్పార్త్తు అరుళిచ్చెయ్‌కిఱార్. ఇత్తాల్- అవన్**

---

అని విశ్లేషించడానికి- వేఱుగా ఉండడానికి దారిలేకుండా పోయిందే- అని అర్థాన్ని గ్రహించవచ్చు.

ఈ అర్థం ఏవిధంగా పొసగుతుంది ? మనలను కాపాడేవాడు భగవానుడే అయినా, "నన్ను రక్షించాలి" అని **"శంఖచక్రగదాపాణే! ద్వారకానిలయాచ్యుత, గోవింద! పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్"** (భారత-సభ-66-41) (శంఖం,చక్రం,గద అనే ఆయుధాలను చేతులలో ధరించినవాడా! ద్వారకలో నివసించేవాడా! దాసులను విడువనివాడా! గోవిందా! పుండరీకాక్షా! శరణు పొందిన నన్ను కాపాడాలి) అనే రీతిలో,ద్రౌపది ఆక్రందించినట్లుగా మనం ఒకమాట అయిన పలుకవద్దా?- అనే సందేహానికి ఇక సమాధానాన్ని పలుకుతున్నారు.

**(కొళ్ళ కుఱై ఏదుమ్ ఇల్లోర్క్కు)** -తాను, మనలను రక్షిచేటపుడు,తమవద్ద ఉండే దేనినీ ఎదురు చూడని రీతిలో నిరపేక్షకుడైనవానికి- అని అర్థం.

**(ఇఱై ఏదుమ్ ఇల్లాద యామ్) -** తమ ఆత్మతో, దానిలో చేరి ఉండే శరీరం మొదలైనవానితో తేడా లేకుండా, అన్నీ భగవానుని సొత్తు అయినందున, దేనినీ మన సొత్తు అని చెప్పడానికి వీలుకాని మనం -అని భావం.

**(కూఱువదు ఎన్ శొల్లీర్)-** "మనలను రక్షించడానికి కారణంగా మనవద్ద ఒకటి ఉన్నది-అని భగవానుని ఉద్దేశించి పల్కడానికి మనవద్ద ఏమి ఉన్నది?

**పరిపూర్ణనాయ్, నామ్ దరిద్రనాన పిన్బు ఉభయ స్వరూపానుగుణమాక అవన్దానే రక్షిక్కు మిత్తనైయొ*ట్రి*య, నామ్ శొల్లవేణ్డువదొన్టుణ్డో? –ఎన్గై.**

**7) అవతారికై–ఏ*ట్రా*మ్ పాట్టు :– కుఱై ఏదు మిల్లోర్క్కెన్టుమ్, ఇఱై యేదు మిల్లాద యామెన్టుమ్ అరుళిచ్చెయ్‌ద ప్రసంగత్తిలే "ఇప్పడి ఇరణ్డు తలైక్కుముళ్ళ ఇల్లామైయై అనుసంధిత్తు, "శేషియానవనై జయిత్తిరుప్పారిల్లై. అదు ఒరువర్క్కు సిద్ధిక్కుమదో?" ఎన్గిఱార్**

---

మీరే చెప్పండి"– అని అంటూ తమకు సమీపంలో ఉండేవారిని చూచి పల్కుతున్నారు, భగవానుడు అన్నివిధాలా పూర్ణుడై, మనం ఏమీ లేని అకించనులమై ఉన్నపుడు, మన స్వరూపానికి తగినట్లు అతడే స్వయంగా రక్షించాలి తప్ప మనం పలుకవలసినది ఏదైనా ఉన్నదా? అని భావం.

**7. ఇల్లై యిరువర్క్కు మెన్టిఱైయై వెన్టిరుప్పార్,**
**ఇల్లై యఃదొరువర్ క్కెట్టుమదో?, ఇల్లై**
**కుఱై యుడైమైదానెన్టు కూఱినారిల్లా**
**మఱైయుడైయ మార్క్కత్తే కాణ్.**

జీవాత్మ–పరమాత్మలనే ఇద్దఱికి (తరువాత పాశురం ఉత్తరార్ధంలో తెల్పిన రీతిలో) "లేదు" అనేది ఒకటి ఉన్నది (అంటే – మనవల్ల భగవానుడు ఎదురు చూచే కొఱత అనేది ఏదీ అతనికి లేదు, అతనికి సమర్పించడానికి మనకు సంబంధించిన సొత్తు అనేది ఏదీ మనకు లేదు) – అని గ్రహించి, స్వామి అయిన అతనిని జయించిన వారెవ్వరూ లేరు. అటువంటి అపూర్వమైన జయం లభించడం ఎవరికైనా సాధ్యమా? ఆ భగవానునకు మననుండి ఏవిధమైన సాధనానుష్ఠానాన్ని ఆశించవలసిన కొఱతలేదు. చేతనునకు సమర్పించదగిన వస్తువు ఏదీ లేదు – అనే ఈ విషయాన్ని అపౌరుషేయం అయిన వేదాల మార్గంలో గమనించండి.

**అవ**– గడచిన పాశురంలో **"కుఱైయేదుమ్ ఇల్లోర్క్కు"** (ఏకొఱత లేనివానికి) అని భగవానుని, **"ఇఱై యేదుమ్ ఇల్లాద యామ్"** (అతనికి శేషభూతులమైన మన వద్ద రక్షకం ఏమీ లేదు) అని జీవుని తెలియాలి –అని అన్నారు. ఈవిధంగా ఇరువురి వద్ద ఉన్నదానిని, లేనిదానిని (లేమిని) భావించడం ద్వారా భగవానుని జయించినవారు చాలా అరుదు. ఆ భావన ఎవరికైనా కల్గుతుందా?– అని ఈ పాశురంలో అంటున్నారు.

**వ్యాఖ్యానమ్–(ఇల్లై ఇరువర్క్కుమెన్ఱు)–ఇరణ్డు తలైక్కుమ్ ఓరిల్లామై యుణ్డెన్ఱు అనుసంధిత్తు,**

**(ఇత్తైయై వెన్ఱిరుప్పారిల్లై)– శేషియానవనై తమ్ స్వాతంత్ర్యత్తాలే వీశా కొమ్బాయ్ నిత్తైయై విట్టు, ప్పరతంత్రనాయ్ వన్దు నిఱ్కుమ్బడి ఇవ్వనుసంధానత్తాలే జయిత్తిరుప్పా రొరువరుమిల్లై**

**(అఃతొరువర్ క్కెట్టుమదో)– అన్ద అనుసంధానమ్ ఒరువర్క్కు ఎయ్దుమదో? అతిదూరమన్రో!– ఎన్నై. ఇరువర్క్కు మిల్లై ఎన్ఱ వదుదాన్ ఏదు? ఎన్ఱు మాకాంక్షైయిలే అరుళిచ్చెయ్‌కిఱార్, మేల్.**

**(ఇల్లై కుఱై యుడైమైదానెన్ఱు)– అవనుక్కు ఇత్తలైయిల్ ఒన్ఱుమ్ కొళ్ళవేణ్డుమ్ కుఱైయిల్లై. ఇవనుక్కు అత్తలైక్కొన్ఱుమ్ కొడుక్కత్తక్క ఉడైమైదానిల్లై–ఎన్ఱు.**

**(కూఱినారెల్లామ్ మఱైయుడైయ మార్క్కత్తే కాణ్)– అదావదు– అపౌరుషేయ మాకైయాలే విప్రలంభాది దోషసంభావనాగంధరహితమాయ్, అత తఏవ ఆప్తతమ**

---

**వ్యాఖ్యానమ్– (ఇల్లై ఇరువర్క్కుమ్ ఎన్ఱు)**–జీవుడు,పరమాత్మ–అనే ఇద్దఱికి ఒక్కొక్క విధమైన లేమి ఉన్నదని భావించి– (భగవానునకు –ఏదీ లేకపోవడమనే లేమి ఉన్నది; జీవునకు తనను రక్షకంగా ఉండేది ఏదీ లేకపోవడమనే లేమి ఉన్నది– అని భావించి) అని అర్థం.

**(ఇత్తైయై వెన్ఱిరుప్పార్ ఇల్లై)**– భగవానుని, జీవుడు తన స్వాతంత్ర్యంతో సమీపించలేని రీతిలో ఉండడం విడచి, పరమాత్మకు విధేయుడై ఉండే ఈ భావనతో (పరమాత్మను) జయించినవారెవరూ లేరు (ఈ భావన దుర్లభం – అని తాత్పర్యం)

**(అఃతొరువర్క్కు ఎట్టుమదో?)**– ఆ భావన ఎవరికైనా పొందడానికి సాధ్యమైనదా? చాలా దూరమైనది కదా– అని భావం. "భగవానునకు, జీవునకు ఉండే లేమి అనేవి ఏవి?" అని అంటే,దానికి సమాధానాన్ని పలుకుతున్నారు.

**(ఇల్లై కుఱై యుడైమైదాన్ ఎన్ఱు)**– జీవునివద్ద పొందవలసిన కొఱత ఏదీ సర్వేశ్వరునకు లేదు. పరమాత్మకు ఇవ్వదగిన తన సొత్తు అయినది ఏదీ జీవునకు లేదు.

**(కూఱినారిల్లా మఱైయుడైయ మార్క్కత్తేకాణ్)** – దీని భావమేమంటే – ఒక

**మాయిరుక్కిఱ వేదమార్గత్తై దర్శిత్తుక్కొళ్-ఎన్గై. "మార్గత్తై క్కాణ్" - ఎన్ఱు సన్నిహితనాయిరుప్పాన్ ఒరువనై ప్పార్త్తుచ్చొల్లుమాపోలే, సర్వర్క్కు ముపదేశమాక అరుళిచ్చెయ్దారాయి*ற்ற*ు.**

**8) అవతారికై - ఎట్టామ్ పాట్టు - నారాయణపదార్థమాన అనన్యభోగ్యత్వత్తై అరుళిచ్చెయ్కిఱార్. కైంకర్యమే పురుషార్థమెన్ఱుమ్, అదు పణ్ణుమ్ క్రమముమితే అదిల్ శొల్లువదు. అవై ఇరణ్డైయుమ్ సంగ్రహేణ అరుళిచ్చెయ్కిఱార్, ఇదిల్.**

---

పురుషునిచే రచింపబడనిది అయినందున విప్రలంభం (మోసగించడం), భ్రమ (తాను భ్రమించడం), ప్రమాదం (గమనించలేకపోవడం), విస్మృతి (మఱపు) మొదలైన దోషాలు కలగడానికి అవకాశం ఏమీ లేనిదై, అందువల్లనే చాలా నమ్మదగినదై ఉండే వేదమార్గంలో దర్శించు– అని అర్థం. "వేదం చూపే మార్గాన్ని చూడు"అని దగ్గరలో ఉండే ఒకనిని చూచి పలికే రీతిలో అందఱికీ ఉపదేశిస్తున్నారు.

**8. విత్తమి*ழ*విన్బమ్ తున్బమ్ నోయ్ వీకాలమ్**
**తత్తమవైయే తలై యళిక్కుమ్, అత్తై విడీర్**
**ఇచ్చియానిచ్చియాదేత్త ఎ*ழ*ిల్ వానత్తు,**
**ఉచ్చియానుచ్చియానామ్**

ధనాన్ని పొందడం, ధనాన్ని కోల్పోవడం, సుఖద్దుఃఖాలు, వ్యాధులు, శరీర నాశం– అనే ఇవి అన్నీ మన కర్మానుగుణంగా సంభవిస్తాయి. వాటినిగూర్చి క్లేశపడి శ్రమపడడం మానండి. అనన్యప్రయోజనుడనే పేరు పొందినవాడు నిష్కాముడై స్వామిని స్తుతించినట్లయితే, ప్రకాశించే పరమపదంలో ఉండే భగవానునుడు అతని శిరస్సు పైకి వచ్చి చేరగలడు.

**అవతారిక :** తిరుమంత్రంలోని మూడవ పదమైన నారాయణపదంయొక్క అర్థమైన (అనన్య భోక్తృత్వరూపమైన) భగవత్కైంకర్యం తప్ప వేఱుదేనినీ ప్రయోజనంగా గ్రహించలేకపోవడమనే విషయాన్ని ఈ పాశురంలో పల్కుతున్నారు. **"నారాయణాయ"** అనే ఆ పదంలో కైంకర్యమే ఈజీవుడు అభిలషించదగినది– అని, దానిని ఏవిధంగా చేయాలి? – అనే విషయాలు చెప్పబడుతున్నాయి. ఆ రెండిటిని సంగ్రహంగా ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానమ్ – (విత్తమిత్యాది)–కైంకర్యమ్ పణ్ణుమధికారిక్కు శరీరత్తోడిరుక్కుమ్ నాళ్, వరుమ్ విత్తలాభ తద్వియోగాదికళడియాక వన్ద హర్షశోకఙ్గళ్ పరమపురుషార్థమాన కైంకర్యత్తిల్ శెల్లుకిఱ మనస్సై ప్పార వడిక్కుమవైయాకైయాలే, అవై వన్దాలుమ్ మనస్సు కలఙ్గామల్ ఇవనిరుక్కైక్కుడలాన ఇవ*ఱ్ఱై* మున్దుఱ అరుళిచ్చెయ్‌కిఱార్. విత్తమ్–ధనమ్. అదావదు– స్వర్ణరజతాదికళ్. ఇ*ழ*వు– తద్వినాశమ్. అదావదు– అస్థిరమాకైయాలే అవ*ఱ్ఱు*క్కు వరుమి*ழ*వు. ఇన్బమ్– అనుకూలవస్త్వనుభవమాకిఱ దు:ఖమ్. నోయ్–శరీరమాన రోగఙ్గళ్. వీకాలమ్–శరీరత్తినుడైయ వినాశకాలమ్.వీవు–ముడివు. ఇవై ఎల్లావ*ఱ్ఱై*యుమ్.

(తత్తమవైయే)– తన్దాముక్కడియాన అన్ద క్కర్మఙ్గళే.

(తలై యళిక్కుమ్)–విపాకదశైయిలే కొడుక్కుమ్ ప్రారబ్ధకర్మఫలఙ్గళానవై వారాదొ*ழி*యాదితే.

---

**వ్యాఖ్యానమ్ : అవ – (విత్తమ్– ఇ*ழ*వు ఇన్బమ్ తున్బమ్ నోయ్ వీకాలమ్)** కైంకర్యం చేసేవానికి, అతడు ఈ లోకంలో శరీరంతో ఉండే దినాలలో, కోరే రీతిలోని సంపదయొక్క, లాభనష్టాల కారణంగా కలిగే సుఖదుఃఖాలు అనేవి ఇతనికి ఉత్తమపురుషార్థమైన భగవత్కైంకర్యంలో అభినివేశం పొందే అతని మనస్సును వేఱు దిశలోకి మళ్ళిస్తాయి కనుక, పైన పల్కిన సంపద మొదలైనవానిలో లాభనష్టాలు కల్గినపుడు మనస్సు కలత పొందకుండా ఇతడు ఉండడానికి కారణమైన వీటిని ముందుగా ప్రస్తావిస్తున్నారు. **విత్తం** –సంపద –అంటే –బంగారం, వెండి మొదలైనవి. **ఇ*ழ*వు**– వాటి నష్టం. అంటే –అవి అస్థిరాలు కనుక, వాటికి కలిగే నాశం. **ఇన్బమ్** – అనుకూలమైన వస్తువును అనుభవించినందున కలిగే సుఖం. **తున్బమ్** – ప్రతికూలమైన వస్తువులను అనుభవించడంవల్ల కలిగే దుఃఖం. **నోయ్** –శరీరానికి కలిగే వ్యాధులు, **వీ కాలమ్** – నశించే కాలం. **వీవు** –శరీరనాశం –అనే వీటిని అన్నిటినీ

**(తత్తమవైయే)**– పూర్వం ప్రస్తావించిన వాటికి కారణమైన ఆయా కర్మలే.

**(తలై యళిక్కుమ్)** – అవి ఫలాన్ని ఇవ్వవలసిన కాలంలో ఇస్తాయి. కర్మలలో సంచితకర్మ– అని, ప్రారబ్ధకర్మ– అని రెండు విధాలైనవి ఉన్నాయి. వాటిలో, ఈ శరీరంలో ఫలాన్ని ఇవ్వడం ప్రారంభిన ప్రారబ్ధకర్మల రూపంలోని పాపాలు అవి

**(అత్తై విడీర్)– అదావదు– అదిల్ మనస్సు వైక్కవేణ్డా– ఎన్లపడి. ఇనిమేల్ కైంకర్యత్తై చ్చొల్లుకిఱదు.**

**(ఇచ్చియాన్)– ఐశ్వర్యాదికళాకిఱ ప్రయోజనాంతరజ్గళిల్ ఒన్రైయుమ్ ఇచ్చియాదవన్.**

**(ఇచ్చియాదేత్త)– ఏత్తుకిఱ ఇదుక్కు పరమపదాదికళాకిఱ ఒన్రైయుమ్ ప్రయోజనమాక ఇచ్చియాదే, స్వయమ్ ప్రయోజనమాక ఏత్త. ఏత్తుకైయావదుదాన్– వాచిక కైంకర్యమితే. "ఆ*ళ్లి*యజ్కైయమ్మానై ఏత్తాదయర్త్తు, వాళా విరున్దొ*ళ్లి*న్దేన్ కీ*ళ్ల*్నాట్కళెల్లామ్" ఎన్లారితే, ఆ*ళ్వా*ర్. ఇదుదాన్ మానస -వాచిక -కాయిక కైంకర్యజ్గళక్కు ముపలక్షణమ్. ఇప్పడి అడిమై శెయ్య.**

**(ఎ*ళ్లి*ల్ వానత్తుచ్చియానుచ్చియానామ్)– అదావదు– "నాకస్య పృష్ఠే"– ఎన్గిఱపడియే విలక్షణమాన పరమాకాశత్తిల్. ఉయర్న్దనిలత్తిలే ఎ*ళ్లు*న్దరుళి యిరుక్కిఱ**

---

ఫలాన్ని ఇవ్వవలసిన వేళలో ఫలాన్ని ఇవ్వకుండా ఉండవుకదా!

**(అత్తై విడీర్)** – అందులో మనస్సును పెట్టకండి –అని దీని భావం. ఇక,పాశురంలోని రాబోయే భాగంలో, కైంకర్యాన్ని గూర్చి చెప్పబడుతున్నది.

**(ఇచ్చియాన్)** సంపద మొదలైన అన్యప్రయోజనాలలో దేనినీ కోరనివాడు.

**(ఇచ్చియాదేత్త)–** ఆ ప్రయోజనాలను కోరకుండా, భగవానుని స్తుతించడానికి ప్రయోజనంగా పరమపదం మొదలైన వేనినీ భావించకుండా, స్తుతించడమే ప్రయోజనంగా భావించి, స్తుతించగా – అని అర్థం. స్తుతించడం అనేది నోటితో చేసే కైంకర్యంకదా! **"ఆ*ళ్లు*యజ్కై అమ్మానై ఏత్తాదు అయర్త్తు, వాళా విరున్దొ*ళ్లి*న్దేన్ కీ*ళ్ల*్నాట్కళెల్లామ్"** (పెరియ తిరువన్దాది–82) అని అనుగ్రహించారుకదా, ఆ*ళ్వా*ర్లు. ఇక్కడ **"ఏత్తా"** అని అంటూ నోటితో చేయబడే వాచిక కైంకర్యాన్నిగూర్చి పల్కడం మనస్సుతో, నోటితో, శరీరంతో చేయబడే మూడు విధాలైన కైంకర్యాలను ఉ పలక్షణ ప్రక్రియలో తెల్పుతుంది. ఈ విధంగా కైంకర్యం చేయగా,

**(ఎ*ళ్లి*ల్ వానత్తు ఉచ్చియాన్ ఉచ్చియానామ్)**– దీని అర్థం ఏమంటే– **"అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్; శుక్రేణ జ్యోతీంషి సమనుప్రవిష్టః ప్రజాపతిశ్చరతి గర్భే అంతః"** (తైత్తి–నారా–1–1) (తీరం

**సర్వేశ్వరనుక్కు శిరసావాహ్యన్– ఎన్గై. ఇత్తాల్– ఇజ్జే యిరున్దు, ఇప్పడి అడిమై శెయ్యుమవన్ నిత్యముక్తరై అడిమై కొణ్డు అజ్జే ఎ*ழு*న్దరుళియిరుక్కుమవనుక్కు అత్యాదరణీయనామెన్గదాయి*ற்று*.**

**9) అవతారికై– ఒన్బదామ్ పాట్టు– కీ*ழ்* ఎట్టు ప్పాట్టాలే పదత్రయాత్మకమాన తిరుమంత్రత్తిల్ ప్రతిపాదిక్కప్పడుకిఱ ప్రమేయజ్ఞళిల్ సారాంశజ్ఞళై అరుళిచ్చెయ్‌దార్.**

---

చూడడానికి సాధ్యం కాని పాలకడలిలో వ్యూహమూర్తిగా, భూమి మధ్యలో అయోధ్య, మధుర మొదలైన చోట్ల విభవరూపాలుగా, దుఃఖం కలవని పరమపదంలో పరవాసుదేవునిగా, జ్యోతిర్మయమైన అర్చాబింబాలలో అర్చామూర్తిగా, మానవుల శరీరాలలో ప్రవేశించి అంతర్యామిగా, పరమాత్మ ప్రకాశిస్తున్నాడు) అనే రీతిలో చాలా గొప్పదైన పరమపదంలో చాలా ఉన్నతమైన చోట వేంచేసి ఉండే పరమపదనాథుడు తలలో పెట్టుకొని నృత్యం చేయదగినవాడై ఉంటాడు. –అని భావం. ఈ విధంగా, దీనిద్వారా ఈలోకం నుండి ఈరీతిలో స్వయంప్రయోజనంగా కైంకర్యాన్ని చేసేవారు, నిత్య ముక్తులను దాసులుగా గ్రహించి, అక్కడ వేంచేసి ఉండే పరమపదనాథునకు, చాలా ఆదరించి అభిమానించదగినవారు కాగలరు –అని భావం.

**9.** **తత్తమిఱైయిన్ వడివెన్ఱు తాళిణైయై,**
**వైత్త వవరై వణజ్గియిరా, – ప్పిత్తరాయ్,**
**నిన్దిప్పార్కుణ్డేఱా నీణిరయమ్ నీదియాల్,**
**వన్దిప్పార్కు ఉణ్డి*ழி*యా వాన్.**

తమ శ్రీచరణాలను శరణంగా చూపి శిరస్సుపై అనుగ్రహించిన ఆచార్యులను తమ తమ దైవంయొక్క దివ్యమంగళవిగ్రహమని తలచి నమస్కరించి ఆశ్రయించని ఉన్మత్తులై నిందించేవారికి, ఏనాటికీ తీరాన్ని చేరలేని సంసారమనే పాడుకూపంలో పతనమే సంభవిస్తుంది. క్రమాన్ని తప్పకుండా ఆచార్యునకు నమస్కరించి, ఆశ్రయించే సచ్ఛిష్యులకు పునరావృత్తి లేని పరమపదం లభిస్తుంది.

**9) అవతారికై –** గడచిన ఎనిమిది పాశురాలలో మూడు పదాలను కల అష్టాక్షరిలో చెప్పబడే, అవశ్యజ్ఞాతవ్యాలైన అర్థాలైన ప్రమేయాల సారమైన విషయాన్ని అనుగ్రహించారు. ఆ తిరుమంత్రాన్ని ఉపదేశించే ఆచార్యుని భగవానుని

**తదుపదేష్టావాన ఆచార్యనై భగవదవతారమాక ప్రతిపత్తి పణ్ణి, తదనురూపమాక అనువర్తియిరాదే, సజాతీయబుద్ధియాకిఱ నిందైయై ప్పణ్ణుమవర్కళుక్కుమ్, తద్వైభవమతిన్దు, తదనుగుణమాక సేవిత్తు ప్పోరుమవర్కళుక్కు ముణ్డావదాన ఫలవిశేషఙ్గళై అరుళిచ్చెయ్కైయాలే ఆచార్యవైభవత్తై అరుళిచ్చెయ్కిఱార్,ఇదిల్.**

**వ్యాఖ్యానమ్–(తన్దమిత్తైయిన్ వడివెన్ను)– "తమ్ తమ్" ఎన్గిఱ మెల్లొ*ఱ్ఱు* వల్లొ*ఱ్ఱా*క్కి "త్తత్త" మెన్ను క్కిడక్కిఱదు. ఆకైయాలే, తన్దామిత్తైయిన్ వడివు–ఎన్గపడి. అదావదు– నారాయణనాకైయాలే ఎల్లార్కుమ్ "నమ్ముడైయ ఇత్తై, నమ్ముడైయ ఇత్తై" ఎన్ను ప్రాప్తి శొల్లి, ప్ప*ఱ్ఱ*లామ్బడి సాధారణశేషియాన సర్వేశ్వరనుడైయ దివ్యవిగ్రహమెన్గై. "సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్" ఎన్గుమ్, "యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ" ఎన్గుమ్ ఆచార్యనై భగవదవతారమాక శాస్త్రమ్ శొల్లానిన్గదిత్తే?**

---

అవతారంగా భావించి, దానికి తగినట్లుగా కైంకర్యాలను చేయకుండా, ఆచార్యుని "మనవలె ఒక మానవుడు" అని భావించడమనే దూషణాన్ని (పాపాన్ని) చేసేవారికి కలిగే ఫలాన్ని, ఆ ఆచార్యుని మహిమ తెలిసి, దానికి అనుగుణంగా కైంకర్యం చేసేవారికి కలిగే ఫలాన్నిగూర్చి పల్కడంద్వారా, ఆచార్యుని గొప్పతనాన్ని ఈ పాశురంలో అనుగ్రహిస్తున్నారు.

**వ్యాఖ్యానమ్ –(తత్తమ్ ఇత్తైయిన్ వడివెన్ను)– "తమ్ తమ్"** అనేచోట మొదటి మకారానికి తకారంరాగా **"తత్తమ్"** అనే రూపాన్ని పొందింది. అందువల్ల ఈ పదాన్ని **"తమ్ తమ్ ఇత్తై"** అని గ్రహించాలి. అంటే – జీవులందఱికి "మన స్వామి, మన స్వామి" అని సంబంధాన్ని నిర్దేశించి పల్కి, ఆశ్రయించేటట్లుగా అందఱికి చెందిన స్వామియైన సర్వేశ్వరుని తిరుమేని – అని భావం. **"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా"** (జయాఖ్య సంహిత) (నారాయణుడనే దేవుడు తానే ఆచార్యుడనే రూపాన్ని పరిగ్రహించి సంసార సముద్రంలో మునిగి ఉండే జీవులను శాస్త్రమనే హస్తంతో కరుణతో ఉద్ధరిస్తున్నాడు– అని, **"యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ, మర్త్యాపత్తిః శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్"** (భాగవతమ్) (జ్ఞానమనే దీపాన్ని యిచ్చే ఆచార్యునిపట్ల ఎవడు సామాన్య మానవుడు అనే భావాన్ని కల్గి ఉన్నాడో, అతడు ఉపదేశం పొందిన జ్ఞానం అంతా ఏనుగు చేసే స్నానంవలె వ్యర్థం) అని ఆచార్యుని భగవానుని అవతారంగా శాస్త్రాలు పలుకుతున్నాయి కదా!

**(తాళిణైయై వైత్తవరై)– "మరుళామిరుళోడ మత్తకత్తు త్తన్ తాళ్ అరుళాలే వైత్తవవర్" ఎన్గిఅపడియే తజ్గళుడైయ అజ్ఞానాంధకారమెల్లామ్ పోమ్బడి తమ్ముడైయ తిరువడికళ్ ఇరణ్డైయుమ్ తజ్గళ్ తలైయిలే వైత్తరుళిన ఆచార్యరానవరై.**

**(వణజ్గీ యిరా ప్పిత్తరాయ్)– ముఱైయిలే అనువర్తిత్తిరాద భ్రాంతరాయ్. "తాళిణైయై వైత్తవరై తత్తమిఱైయిన్ వడివెన్ఱు వణజ్గీయిరా ప్పిత్తరాయ్"ఎన్గైయాలే, అర్థసిద్ధియిల్ ప*ఱ్ఱు*దుణ్డాయన్ఱు, అప్పడి ప్రతిపత్తి పణ్ణి, అనువర్తిత్తిరాదొ*ఴి*కిఅదు. ఇవర్కళు డైయ చిత్తస్థలనమెన్ఱు నినైత్తు అరుళిచ్చెయ్కిఆర్.**

**(నిన్దిప్పార్క్కు)– మానుషప్రతిపత్తి యాకిఅ నిన్దైయై ప్పణ్ణుమవర్కళుక్కు, వేఱొన్ఱు మవైయుణ్డో! ఇప్పడి ప్రతిపత్తి పణ్ణుకైదానేయాయి*ఱ్ఱు* నిన్దై.**

**(ఏఴా నీణిరయ ముణ్డే)–అదావదు–ఇప్పడి నిందిక్కుమవర్కళుక్కు ఒరునాళు మ్ కరైయే*ఱ్ఱ*మిన్ఱిక్కే, నెడుకచ్చెల్లా నిఱ్కుమ్ సంసారమాకిఅ నరకముణ్డెన్గై. "ఏఴా నీణిరయ" మెన్గైయాలే, యమన్ దణ్డలాన నరకత్తిఱ్కాట్టిల్ ఇదుక్కుణ్డాన వ్యావృత్తియై**

---

**(తాళిణైయై వైత్త అవరై )– "మరుళామ్ ఇరుళోడ మత్తకత్తు త్తన్ అరుళాలే వైత్త అవర్"** (జ్ఞానసారమ్–36 ) అనే రీతిలో తమ అజ్ఞానాంధకారాన్ని అంతా నశించే రీతిలో తమ శ్రీచరణాలను రెండిటినీ తమ శిష్యుల శిరస్సు పై ఉంచిన ఆచార్యులను,

**(వణజ్గీ ఇరా ప్పిత్తరాయ్)**– క్రమానుసారంగా కైంకర్యాన్ని చేయని మోహాన్ని పొందినవారై, అని అర్థం. **"తాళిణైయై వైత్త అవరై తత్తమ్ ఇఱైయిన్ వడివెన్ఱు ఇరా ప్పిత్తరాయ్"** అని అన్నందున ఆచార్యుడు భగవానుని ఇంకొక తిరుమేనిగా ఉ ంటాడు– అనే స్థితిలో ఏ కొఅత లేదు. ఆ విధంగా భావించి కైంకర్యం చేయకుండా ఉండడం వీరి మనస్సులోని కాలుష్యంవల్లనే – అని అంటున్నారు.

**(నిన్దిప్పార్క్కు)** ఆచార్యుడుకూడా ఒక మానవుడు అని భావించడ మనే దోషాన్ని చేసేవారికి వేఱొక అపచారం అక్కఱ లేదు. ఆ విధంగా భావించడమే గొప్ప అపచారం – అని భావం.

**(ఏఴా నీణిరయ ముణ్డు)**– అంటే – ఈవిధంగా అపచారం చేసేవారికి ఏ కాలానికి తీరాన్ని చేరలేని , దీర్ఘంగా కొనసాగే సంసారమనే నరకం కల్గుతుంది

**చ్చెల్లుకిఱదు. అదుక్కొరుకాల్ కరైయేఱ్ఱముణ్డిఱే. ఇదు నిత్యమాయ్ చ్చెల్లుమిత్తనైయిఱే. ఇత్తాల్– ఆచార్యవిషయత్తిల్ మానుషప్రతిపత్తి పణ్ణుమ్ మహాపాపియానవర్కళ్ ఒరు కాలత్తిలుమ్ ఉజ్జీవనయోగ్యతైయిన్ఱిక్కే నిత్యసంసారికళాయ్ పోవర్కళెన్ఱదాయిఱ్ఱు.**

**(నీదియాల్ వన్దిప్పార్క్కుణ్డిఱ్ఱియావాన్)– అదావదు– కీఴ్చ్చొన్నపడియే లవతారవిశేషమెన్ఱు ప్రతిపత్తిపణ్ణి ముఱై తప్పామల్ అనువర్తిత్తుప్పోరుమవర్కళుక్కు పునరావృత్తి యిల్లాద పరమపదముణ్డెన్నై. ఇత్తాల్– ఆచార్యవైభవత్తై నన్ఱాక అఱిన్దు, అవన్ తిరువడికళిలే "తేవు మఱ్ఱఱియేన్" ఎన్ఱు సేవిత్తుప్పోరుమ్ మహాత్మాకళానవర్కళ్ తిరునాట్టిలే పోయ్,అఙ్గుళ్ళారోడు సమానభోగభాగికళాయ్ ఇరుప్పర్– ఎన్ఱదాయిఱ్ఱు.**

**10) అవతారికై– పత్తామ్ పాట్టు :– ఇప్పడి ఆచార్యవైభవత్తై అరుళిచ్చెయ్ద అనంతరమ్,**

---

– అని భావం. **"ఏఴా నీణిరయమ్"** అని అన్నందున యముడు దండనను ఇచ్చే నరకం కంటే ఈ నరకానికి కల క్రూరత్వం చెప్పబడింది. యముడు ఇచ్చే నరకదండన నుండి ఏదో ఒక సమయంలో విముక్తి కల్గుతుంది. ఈ నరకం **"మీళా నరకమ్"** కదా! ఈవిధంగా దీనిద్వారా ఆచార్యుని ఒక మానవునిగా భావించే మహాపాపులు అన్ని కాలాలలోను ఉజ్జీవించడానికి యోగ్యత లేకుండా, ఏనాటికీ సంసారంలో పరిభ్రమిస్తారు – అని పల్కినట్లైనది.

**(నీదియాల్ వన్దిరుప్పార్క్కు ఉణ్డు ఇఱ్ఱియావాన్)** – అంటే – పూర్వం పల్కిన రీతిలో ఆచార్యుని, భగవానుని ఇంకొక అవతారం అని తలచి , క్రమం తప్పకుండా వారికి కైంకర్యం చేసేవారికి పునరావృత్తి లేని పరమపదం లభిస్తుంది –అని భావం. ఇందువల్ల ఆచార్యుల గొప్పతనాన్ని చక్కగా గ్రహించి, వారి శ్రీచరణాలలో **"తేవు మఱ్ఱఱియేన్"** (కణ్ణినుణ్–2) అని కైంకర్యం చేసే మహాపురుషులు పరమపదానికి చేరి అక్కడ ఉండే నిత్యముక్తులతో సాటిగా మహానందాన్ని అనుభవిస్తారు – అని పల్కినట్లైనది.

**10. ఇఱైయు ముయిరు మిరువర్క్కుముళ్ళ**
**ముఱైయుమ్, ముఱైయే మొఴియుమ్, మఱైయై**
**ఉణర్త్తువార్ ఇల్లా నాళన్ఱల్ల, అన**
**ఉణర్త్తువార్ ఉణ్డాన పోదు.**

**ఇవ్వాచార్యన్ పణ్ణుమ్ ఉపకారవైభవత్తైయుమ్ లోకమెల్లామ్ అఱియుమ్పడి సుస్పష్టమాక అరుళిచ్చెయ్‌దు, ఇప్ప్రబంధత్తై నిగమిక్కిఱార్.**

**వ్యాఖ్యానమ్– (ఇఱైయుమ్)–అకారవాచ్యనాన ఈశ్వరనుమ్,**

**(ఉయిరుమ్)– మకారవాచ్యనాన ఆత్మావైయుమ్,**

**(ఇరువర్క్కుముళ్ళ ముఱైయుమ్) – అకారత్తిల్ చతుర్థియాలే శొల్లప్పట్ట శేషిశేషభావమాకిఱ తదుభయసంబంధముమ్,**

**(ముఱైయే మొழிయుమ్ మఱైయుమ్)– అన్ద సంబంధత్తైయే క్రమమాక ప్రతిపాదిక్కిఱ వేదరూపనాన తిరుమంత్రముమ్,**

---

సర్వేశ్వరుడు, జీవుడు – ఈ ఇద్దఱి మధ్య గల శేష–శేషి భావరూపమైన సంబంధాన్ని యథాతథంగా తెలిపే వేదరూపమైన తిరుమంత్రాన్ని ఉపదేశించే ఆచార్యుడు లేని కాలం అసత్కల్పమే. ఉపదేశించే ఆచార్యుడు ఉండే కాలమే నిజమైన కాలం.

**అవతారిక** – ఈరీతిలో ఆచార్యుల గొప్పతనాన్నిగూర్చి పల్కిన తర్వాత, ఆ ఆచార్యుడు శిష్యునకు చేసే ఉపచారం (కైంకర్యం) యొక్క గొప్పతనాన్ని లోకం అంతా తెలిసేటట్లుగా చాలా స్పష్టంగా పల్కి, ప్రమేయసారమనే ఈ ప్రబంధాన్ని పూర్తి చేస్తున్నారు .

**వ్యాఖ్యానమ్ – (ఇఱైయుమ్ )**– అకారంచే చెప్పబడే సర్వేశ్వరుడు,

**(ఉయిరుమ్)** మకారంచేత చెప్పబడే జీవాత్మ,

**(ఇరువర్క్కుమ్ ఉళ్ళ ముఱైయుమ్)–** అకారం పై వచ్చి లోపించిన (లుప్తచతుర్థి) నాల్గవ విభక్తి చే చెప్పబడినదై, సర్వేశ్వరుడు –శేషి, కైంకర్యాన్ని గ్రహించేవాడు, జీవాత్మ–శేషభూతుడు, కైంకర్యాన్ని చేసేవాడు– అని ఇద్దఱి మధ్య గల సంబంధం.

**(ముఱైయే మొழிయుమ్ ముఱైయుమ్ )**– ఆ సంబంధాన్ని యథాతథంగా పలికే వేదసారమైన తిరుమంత్రం,

**(ఉణర్తువారిల్లానాళొన్నల్ల)–ఇవై ఎల్లామ్ నిత్యమా యిరున్దదేయాకిలుమ్, ఇవ*ఱ్ఱై* అతివిప్పారిల్లాద కాలత్తిలే ఎల్లామ్ అసత్కల్పమాయ్ క్కిడన్దన. ఆక ఉణర్తువార్ ఉణ్డానపోదు ఇవై ఎల్లామ్ అతిప్పార్క్కుణ్డాన కాలత్తిలే ఉళవాయి*ఱ్ఱి*న– ఎన్గై. ఇవ*ఱ్ఱై* అతివిక్కుమవనాకిఱాన్– ఆచార్యనిఱే. అదుదాన్ ఇప్రబంధత్తిల్ ముదల్పాట్టాలే అరుళిచ్చెయ్దారిఱే, తామే. ఇత్తాల్–అజ్ఞాతజ్ఞాపకనాన ఆచార్యన్ పణ్ణుమ్ ఉపకారవైభవత్తై అరుళిచ్చెయ్దారాయి*ఱ్ఱు*.**

**పెరియజీయర్ అరుళిచ్చెయ్ద ప్రమేయసారవ్యాఖ్యానమ్ ము*ఱ్ఱి*ఱ్ఱు**

**పెరియజీయర్ తిరువడికళే శరణమ్**



---

**(ఉణర్త్తువార్ ఇల్లా నాళ్ ఒన్లల్ల)**– పైన చెప్పబడిన ఇవి అన్నీ ఏనాటికి ఉండేవి అయినా (నిత్యమైనా), వీటిని గూర్చి ఉపదేశించే ఆచార్యులు లేని కాలంలో ఇవి అన్నీ లేనివిగా అవుతున్నాయి.

**(ఆన ఉణర్త్తువార్ ఉణ్డానపోదు)** – వీటిని అన్నిటిని యథాతథంగా ఉపదేశించేవారు ఉండే కాలంలో ఇవి ఉండేవి కాగలవు – అని అర్థం. వీటిని తెలిపేవాడు ఆచార్యుడే కదా ! ఆ విషయాన్ని మొదటి పాశురంలో **"అవ్వానవరుక్కు మవ్వానవరెల్లామ్ ఉవ్వానవర్ అడిమై ఎన్ను ఉరైత్తార్"** అని వీరే పలికారుకదా! ఇందువల్ల అజ్ఞాతార్థాలను తెలిపే ఆచార్యుడు చేసే ఉపకారంయొక్క గొప్పతనాన్నిగూర్చి తెల్పినవారయ్యారు.

**శ్రీమణవాళ మహామునులు అనుగ్రహించిన ప్రమేయసార వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం సంపూర్ణమ్.**

**అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమ్**

**జీయర్ తిరువడిగళే శరణమ్.**



# అనుబంధం-1

(గరుడవాహన పండితుని దివ్యసూరిచరితంలోని అష్టాదశ సర్గలో 6వ శ్లోకం నుండి 9వ శ్లోకం వరకు గల నాల్గు శ్లోకాలలో తెలుపబడిన అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ చరిత్ర.)

**1. ఆయాతో రమరాపగోపకంఠాత్ కారుణ్యాకర ఇతి కశ్చిదేకదండీ ।**
**శ్రీరంగం పరిచితశాస్త్రపంక్తి రేత్య శ్రీరామానుజగురు మాహ వాద మీప్సుః ॥**

**2. శిష్య స్స్యాదపజయభాగితి ప్రతిజ్ఞా ముద్బాహూజ్జ్వలనృహరేః పురో విధాయ।**
**అన్యోన్యం విరచయతో తయోర్వివాదం తత్రాష్టాధికనవ వాసరా వ్యతీయుః ॥**

**3. జాతేఽ ష్టాదివసే హరేః విషణ్ణః స్వప్నే కాలమపి జయహేతు మేత్య యుక్తమ్।**
**తం రామానుజసుమతిః నిరాకృతాగ్నిః మార్తాండాద్రుచి మివ నైశ మంధకారమ్॥**

**4. తద్యుక్త్యాహితమతి రుజ్ఝితైకదండః సన్న్యస్తః పునరుపనీతవాం స్త్రిదండీ ।**
**ఛాత్రో లక్ష్మణయమినోఽ భవత్ స చ స్వచ్ఛాత్రాణా మకృత తమాత్మనిర్విశేషమ్॥**

## అనుబంధం-2 : ఆచార్య సూక్తిముక్తావళి ప్రబంధంలో అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ చరిత్ర

నయ్యతిపతి యురుతరకీర్తివి, స్ఫూర్తిని విని యజ్ఞమూర్తి వచ్చి
తే. జగతి రంగేశ విజయధ్వజం బసంగ, వాసి కెక్కిన లక్ష్మణ దేశికేంద్రు
వాద భిక్షార్థమ చూచె వరుసననుచు, వాదిభీకర గురుఁడనె మోదమలర

సీ. ఆ రంగభూపతి యాస్థాన మంటప, మణిభూమి గురుశిఖామణులనడుమ
నమలనభోవీథి విమలగ్రహర్క్ష స్థ, పూర్ణచంద్రుని గతిఁ బొలుపు మీఱ
బ్రహ్మతర్కచ్ఛటా ప్రబలశస్త్రాశస్త్రి, సమరకేళీమహోత్సవము సల్ప
నొడ్డోలగంబున్న యూర్జిత యతిపతి, బాలసూర్యభ్రాంతిఁ బరమపురుషు

తే. చుట్టుఁ గైదువుఁ గబళింపఁ జొచ్చు రాహు, వట్లు గదిసెను బ్రతివాది యజ్ఞమూర్తి
యిట్లు శపథమొనర్చి రాయిరువురనుచు, వాదిభీకర గురుఁడనె మోదమలర

సీ. అష్టాదశదినంబు లాగమాంత ప్రసిద్ధ బ్రహ్మతర్కశస్త్రముల చేతఁ
గస్తూరిరంగని కను మ్రోలఁ బోరంగ, నెవ్వని తర్కము హెచ్చి యుండు
వారికి శిష్యు లావలివారు గావలె నని పంతమాడి రామానుజార్యుఁ
డా ప్రతివాదితో నద్వితీయబ్రహ్మ, జీవాత్మలకు భేదసిద్ధికొఱకు

తే. బ్రహ్మతర్కోపనిషదాది పరమజీవ, భేదసాధకసూక్తుల వాదమొందఁ
గడచెఁ బదియాఱుదినములీ కరణి ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర

సీ. పదియేడవ దినంబు పగట నాప్రతివాది, తర్కప్రమాణముల్, తఱచు నుడువ
వీని ప్రత్యుక్తులు వినిపింతురేపని, యతిపతి మఠమున కరిగి యచటఁ
బరమదయాలునిఁ బరముని వరదునిఁ బరభక్తినర్చించి భక్తియుతుల
నను యోగ మొనరింపుఁడని పంచి వరదుని, శ్రీపదాబ్జంబుల చెంతఁజెంది

తే. నాథ! నీవన్న సూక్తులు నమ్మి యిట్లు భేదవాదం బొనర్చితిఁ బెక్కుగతుల
దీని నిగ్గింపుమని నన్నుతించె ననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర.

సీ. యతిపతిస్తవ మంది యావరదుండు, కనుమ్రోల నిలిచి యీ కరణిఁబల్కె
నీయంతశిష్యుని నీకు సంపాదింప, నిట్లు చేసితి నిప్పుడేమి కొఱఁత
ప్రణవో ధనుర్యను ప్రబలోపనిషదుక్తి, మఱిచితివో యనమదినిదెలిసి
సంతసమొంది లక్ష్మణ గురుండా రాత్రి, గడపి ప్రభాతకైంకర్యవిధుల

తే. జరపి శ్రీరంగభూపతి సభకు వచ్చి, మోదమలరంగ నాయజ్ఞమూర్తి నందుఁ
జూచెనని యానతిత్తురు సూరులనుచు, వాదిభీకర గురుఁడనె మోదమలర

సీ. అమృతాంశుబింబసు ధాసారముల మాడ్కి, ముఖమున దరహాసములు వెలుంగఁ
గాషాయపరిధాన కనదుత్తరీయము, లరుణోదయద్యుతి నవహసింప
ద్వాదశోర్ధ్వలధృత ధవళోర్ధ్వపుండ్రముల్, శ్రీచూర్ణరేఖలు చెలువు గులుకఁ
బ్రతివాది గర్వపర్వత వ్రజసారమై, కేలఁద్రిదండంబు లీలమెఱయ

తే. నురము పద్మాక్షమాలిక ఉల్లసిల్ల, సభను వెలుఁగంగ యతిలోక చక్రవర్తి
మూర్తి వీక్షించె నాయజ్ఞమూర్తి యనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర

సీ. జీవేశ్వరభేద చిన్మాత్ర సత్యత్వ, తదితర సకలమిథ్యాత్వములను
స్థాపించు యుక్తుల ద్వైతశ్రుతులు కొన్ని, నిన్న మీరనిన యన్నింటికిపుడు
ప్రత్యుత్తరములు గాఁబల్కెద బాధక, తర్కభేదశ్రుతి తతులననుచు
యతిపతి పల్కిన యజ్ఞమూర్తియు నిన్ను, శేషశేషాసన శ్రీధరాస్య

తే. తమునిఁగా మది నెఱిఁగితిఁ దావకాస్య, చంద్రనిర్గతదరహాస, చంద్రికలను
జూచి యని పల్కె లక్ష్మణసూరికనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర

సీ. సర్వజ్ఞమౌళివి సద్గుణరాశివి, జగదేక గురుఁడవస్మద్గురుండ
వైతివిం కాలస్య మమృతం విషమ్మను, న్యాయంబునను జాగు సేయఁదగునె
యనిన లక్ష్మణుని యాయజ్ఞమూర్తికి, సకలహితంబులు సలిపి కృపను
అరుళాళపదమట్లు పెరుమాళ్లనెడి పద, మెంబెరుమానారనెడి పదమును

తే. మూఁడు జోడించియొక నామ మీడుపఱిచి, దాస్యనామంబొనర్చెనందఱు వినంగ
వెలసెఁ దిరునామ మతనికాకొలఁదిననుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర

సీ. తలఁప శిష్యస్య పుత్రస్య న కించిదం, తర మనుధర్మశాస్త్రమునఁ జేసి
యభిమత శిష్యునకాత్మజసదృశున, కితనికి మనకు మహేష్టదైవ
తంబు మహోపకర్తయు నగువరదుని, తిరునామ మాదిని దిర మొనర్చి
గురునామ మీతండు గోరెఁ గావున నిది, యంతిమపదముగా నమరఁగూర్చి

తే. యేకనామంబుఁగావించి యితని కిడిన, మనకు మనవారికందఱ కనుగుణముగఁ
బిలువఁదగునని యీ పేరు పెట్టెననుచు, వాదిభీకర గురుఁడనె మోదమలర

సీ. ఆ దాస్యనామోక్తి నరుళాళముని స్వకీ, యాచార్యవందన మాచరించి
స్వగురునివేదిత సర్వస్వుఁడై స్వార్య, ననుమతి నొక మఠమందెనుండె
నంత మేల్నాటినుండాగంతు వైష్ణవులిరువురాతిరువీథి కేఁగు దెంచి
మదీనీయ మెంబెరురుమానారుమఠమెద్ది, యని యడిగిన విని యచటివార

తే. లిరువురెంబెరుమానారు లిచటఁ గలరు, వారిలో మీరు గోరిన వారి మఠము
దెలుపఁగల మని వారికిఁ బలికి రనుచు, వాదిభీకర గురుఁడనెమోదమలర

సీ. ఇపుడిలయాళువా రెంబెరుమానారు, మఠముఁజూపింపుఁడీ మాకుమీర
లిట్లన్నవిని వార లట్లొనర్చిన యంత, నావార్తవిని వరదాఖ్యగురుఁడు
ఎంబెరుమానారు కెదురు తట్టైతిని, నభినవార్యద్రోహి నైతి ననుచు
ననుతాప మంది దుఃఖాయత్తచిత్తుఁడై, దీనికి నిష్కృతి దెలిసెననుచు

తే. మఠము పెనుచిచ్చుపాల్సేసి మచ్చ మాపి, యతిశిఖామణికడకేఁగి యతినిపాద
పద్మసేవధిఁ గాంచెను భక్తిననుచు, వాదిభీకర గురుఁడనె మోదమలర

సీ. ఆర్తితో యతిపతి యడుగునెత్తమ్ములఁ జాఁగిలఁబడి మ్రొక్కిజనులు గనఁగఁ
గన్నీటిధారలఁ గడుగుచు దుస్తర, మీగురుద్రోహాబ్ధి నెట్లు గడతు
నని పల్క యతిపతి యాశిష్యవర్యునిఁ, గరుణతో గ్రుచ్చెత్తి కౌఁగిలించి
నీకేమి కొఱతఁ యీ నీవు బహిఃప్రాణ, భూతశిష్యుఁడవని బుజ్జగించి

తే. యాత్మసాన్నిధ్యవర్తిగా నాదరింప, ఛాయపోలిక గురునెడఁ బాయ కుండె
నట్టి యరుళాళమునిఁదల్తు ననిశ మనుచు, వాదిభీకరగురుఁడనె మోదమలర

సీ. అరుళాళముని కృప నానతిచ్చెను జ్ఞాన, సారమును బ్రమేయ సారమరసి
గురుని యానతి.

